ప్రతి ఇంటా ఉండదగిన ఉత్తమ గ్రంథంగా

"జనహిత" ఎంపిక చేసిన పుస్తకం

# వైతాళికులు

## (కవితల సంపుటి)

సంకలనం

**ముద్దుకృష్ణ**





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

**VYTHALIKULU** (Poetry Volume) *Compiled by* **Muddu Krishna**

గత ముద్రణలు : 1935, 1948, 1955, 1957, 1962, 1966, 1968, 1973, 1987, 1994

ప్రచురణ నెం. : 2336

ప్రతులు : 1000

12వ ముద్రణ : అక్టోబరు, 2002

టైటిల్ డిజైన్ : పవన్

**వెల: రూ.70-00**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరకూర్పు: ట్వంటీఫస్ట్ సెంచరీ, ఫోన్: 4066986

*ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్, నారాయణగూడ, హైదరాబాద్. ఫోన్: 3224831*

# ముందుమాట

చీకటిలోనికి దీపికను తీసుకొని రాగలరు కాని, ఎవ్వరూ చీకటినే వెలుతురుగా మార్చలేరు. దీపానికి యెంత చేరువుగా రాగలిగితే అంత వెలుతురు లభ్యమౌతుంది. కాని దీపానికి వీలున్నంత దూరంలో నిలిచి, వెలుతురు చాలదని నిందించేవారిని చూసి విచారపడడంకన్న వేరేమీ చేయలేము.

ఇదికాకను, సహృదయంతో, కవిభావన క్రీనీడ దగ్గరకుచేరి కూడా స్వారస్యాన్ని అనుభవించలేకపోవచ్చును.

కళలలోవున్న ఘట్టిచిక్కు ఇదే: గ్రహించగలిగిన చురుకుదనం ప్రధానంగా అపేక్షణీయం. తార్కాణకు, సంగీతాన్ని తీసుకుందాం: మొదటి దశలో, లయ ఆ వృత్తిని గ్రహించలేము సరేగదా, వివిధరాగాల వైఖరులను సహితం తెలుసుకోలేము; ఇక మూర్ఛనాదుల సంగతి చెప్పనక్కరలేదు. వినికిడివల్లనూ, ప్రవేశం కలిగిన కొలదీ, రసగ్రహణపారీణత కలుగుతుంది, స్వారస్యం హెచ్చుతుంది. చిత్రకళలోకూడ....ఏ కళలోనైనా, ఇంతే.

అందుచేతను, కళోపాసకునికి వీలున్నంతచేరువై, అతని పరిభాషనూ సాంకేతికాల్నీ అంగీకరించి, అతని సృష్టిలోని రసాన్ని ఆనందించవలెను. ఈ దృష్టి అలవరచుకోవలెనంటే, దేశ కాల పాత్రలను సమన్వయం చేసుకోవడం కూడా అవసరం.

ఏ నూతనదృష్టిని అలవరచుకుంటే సంఘానికి భావిలో ఎక్కువ నీతీ, ఉత్తమగతీ కలుగుతుందో, దానిని కవి సూచిస్తాడు. దీనినే షెల్లీ ''కవులు ప్రపంచంలో నీతిని ప్రచ్ఛన్నంగా తీర్చిదిద్దే శాసనాధికారులు'' అన్నాడు. కాని ఎంత ఉత్తమ కవికైనా భవిష్యత్తు ఎంత ప్రధానమైనా, ఎంత ఆకర్షణ అయినా, భూత వర్తమానాలతో బాంధవ్యం ఉండకపోదు.

భూతకాలం కూర్చిన మహత్తరత నంతా అతను స్వాయత్తం చేసుకుంటాడు; భవిష్యత్తులోకి, ఉత్తమ మార్గాన సంఘాన్ని నడిపించడం తన నిరంతరలక్ష్యంగా యెంచుకుంటాడు.

అందుచేత, భూతభవిష్యత్తులు, అతనికి యెంత విలువగలవి అయినప్పటికీ, అతని ఆందోళనా, యత్నమూ, వర్తమానానికి చెందినవే - అతని హృదయం కొట్లాట వర్తమానంలోనే.

ఈ కారణంచేతను, ఏ కవి రచనలలోనైనాసరే, తన సంఘ పరిస్థితులూ, తన కాలానికి చెందిన వాతావరణమూ ప్రతిబింబితం కాకమానవు. అంతేకాదు, నిజమైన కవి, వీటిని రద్దుచేసుకుని జీవించడు. తన జీవితానికీ, తన సంఘానికీ, తన దేశానికీ, తాను జీవించిన కాలానికీ, సన్నిహితంకాని కృతికి విలువలేదు.

దేశ కాల పాత్రలలో కలిగిన మార్పులవల్ల, ఈనాటి కృతులలో విశదమయ్యే విశేషతను యెంచేవముందు, ఇంతకుపూర్వం తెనుగుకవుల జీవితాలకూ, వారి కృతులకూ, వారి కాలానికీ గల సంబంధాన్ని దిఙ్మాత్రంగా సూచిస్తాను.

భారతాంధ్రీకరణానికి పూర్వరంగంగా వున్న అజ్ఞాతయుగం కేవలం అజ్ఞాతంగానే ఉన్నది.

## పురాణయుగం

వ్యక్తినిగాని, సంఘాన్నిగాని కలవరపెట్టే ఏ యితర సమస్యాలేని ఆ కాలంలో, మతానికి కలిగిన ప్రాముఖ్యత మరి దేనికీ లేకపోయింది. అందుచేతనే, అప్పటి సారస్వతం అంతా మతధర్మ సంగ్రహాలతోనూ, మతవివాదాలను పురస్కరించుకొన్న గ్రంథాల తోనూ నిండిపోయింది. మతధర్మప్రచారం ఇంత ప్రధానం కావడంవల్లనే, పురాణ యుగంలో సంస్కృత మాతృకల అవలంబనం లేకుండా స్వతంత్ర గ్రంథరచన జరగలేదు.

## ప్రబంధయుగం

ముసల్మానుల రాకతో దేశపరిస్థితులు మారిపోయినవి. అంతఃకలహాలను మాపుచేసుకొని, అరివీర భీకరుడూ, జాతీయగౌరవ ప్రతిష్ఠాపకుడూ అయిన జేత ఆధిపత్యంక్రిందకి రావలసివొచ్చింది. తెలుగునాడు అంతా, ముసల్మాను వాహినిని తుంగభద్రకు ఆవలి తీరాన్నే ఆకట్టి, ఆంధ్రశిల్పచాతుర్యాన్ని వెలయించే మహాపట్టణాన్ని - 'విద్యానగరాన్ని' - నిర్మించి, తన కొలువున అష్టదిగ్గజాల విశృంఖల విహారానికి అదను కల్పించిన కృష్ణదేవరాయల రాజ్య నిర్వహణతో ప్రజాసామాన్యానికి చక్కని శాంతీ, సంఘానికి ఐశ్వర్యమూ, దేశానికి అభిమానగౌరవాలూ అలవడినవి. ఐశ్వర్యంతో తులతూగుతూ సుఖాపేక్షా, భోగలాలసతా కోరుతూవున్న నాటి సంఘాదరణ కలగడానికీ, సుస్థిర సామ్రాజ్యంలో విద్యావినోదాలతో జీవితం ఆనందప్రదంగా అనుభవిస్తూన్న ప్రభువు మెప్పు పొందడానికీ, శృంగారం ప్రధానరసంగా మప్పిన ప్రబంధం నిర్మితమయింది. పెద్దన్న మొదలు చేమకూరవానివరకూ, గడచిన ప్రబంధ యుగంలోని సారస్వతానికి, మనుచరిత్రలోని ప్రధానలక్షణాలే సామాన్యాలైనవి.

## అంధయుగం

తంజావూరు నాయకుల రాజ్యాంతంతో దేశ కాల పరిస్థితులు ఇంకొక మార్పు చెందినవి. చితికిపోయిన ఆంధ్రసామ్రాజ్య సౌభాగ్యం, చిల్లరప్రభువులపాలైనది. 'ఏనుగుపాడిగా' ఈయగలిగిన ప్రభువులు కరువైనా కృతి సమర్పణకు అగ్రహారపారితోషికాన్ని ఆశించే కాంక్ష కవులను వదలలేదు. ఏ ధనవంతుడు యెటువంటి కృతిని మెచ్చుకుంటాడంటే అటువంటి రచనచేసి, వాణిని వాణిజ్యానికి దింపారు తరువాతి కవులు. అంతేకాదు, మెచ్చి ఇచ్చెనా చంద్రలేఖా 'విలాసము', మెచ్చక పొమ్మనెనా చంద్రలేఖా 'విలాపము', ఇటువంటి హేయ కవిత్వ జీవనానికికూడా కొందరు కవులు లోనయ్యారు. ఇది అంధయుగానికి విశిష్టలక్షణం.

## నవయుగం

సంస్కారి, సంఘాభిమాని, స్వార్థరహితజీవనుడు అయిన వీరేశలింగంపంతులు లక్ష్యీకరించిన నూతనాదర్శాలు అనే తెలిరేకలు, సారస్వత విహాయస ప్రాగ్దిశాముఖాన యెప్పుడు తోచినవో, అప్పటితో అంధయుగం విరిసిపోయింది. భావసంచలనం తీవ్రంగా కలిగించి, సంఘానికి నూతన లక్ష్యాలను నిర్దేశించి వీరేశలింగంపంతులు యుగకర్త అయినప్పటికీ, సారస్వతచరిత్రలో నవయుగ స్థాపనాచార్యులుగా యెన్నదగినవారు గిడుగు రామమూర్తి పండితులూ, గురజాడ అప్పారాయ కవిన్నీ.

దేశ కాల పరిస్థితులలో ఇంకొకమార్పు వచ్చింది. వెనుకటి ఏ యుగంలోనూ లేని కొత్త సమస్యలు అనేకం ప్రతిదేశంలోనూ ఈనాటి కవులను కలవరపెడుతూ వున్నవి. ఆర్థికంగా, రాజకీయంగా, నైతికంగా, సాంఘికంగా, వ్యుత్పన్నతాపరంగా తీవ్రమైనమార్పులు ప్రపంచమంతటా జరుగుతూవున్నవి.

గాంధి, అరవిందయోగి, రవీంద్రుడు, ఇబ్‌సెన్, మార్క్స్, టాల్‌స్టాయ్, బెర్నార్డ్ షా, రోమాఁరోలాఁ - వీరి సందేశాలూ, కావ్యాలూ ఒక సంఘానికీ ఒక దేశానికీ అనేకాక, మానవకుటుంబానికి అంతకీ అన్నట్లు అయిపోయినవి. వార్తాగ్రహణానికి కావలసినన్ని సౌకర్యాలు అమరడంచేత, ఏ రష్యాలోనో, ఏ అమెరికాలోనో, ఒక సంచలనం కలిగినా, కావ్యరచనలో ఒక నూతన నిర్మాణం జరిగినా, అది తక్షణమే అన్ని దేశాలలోనూ మేధావంతులనందరినీ ఆకర్షిస్తూ వున్నది. ప్రాచీనంలోనే యుగపరంపరగా విస్పష్టమైన మార్పులు కలుగుతూ వచ్చినప్పుడు; ఈనాడు, ప్రతిదేశంలోని విజ్ఞానమూ, ఏ దేశంలో ఏ వ్యక్తికైనా యింతసులభంగా అందుబాటులోనికి వొస్తూవున్నప్పుడు; ఆధునికసారస్వతంలో కలిగిన మార్పుకన్న రాదగిందే యెక్కువ ఉన్నదేమో అనిపిస్తూంది.

విజయవాడ,
1935.

ముద్దుకృష్ణ

★ ★ ★

# సంస్కృతి

ముద్దుకృష్ణ పేరు చెప్పగానే మొదట మనకు స్ఫురించేది ఆయన సమకూర్చిన కవితాసంకలనం ''వైతాళికులు.'' ''వైతాళికులు'' మొట్టమొదట ప్రచురించినప్పుడు ఆయన పడిన శ్రమ, చూపిన ఓర్పు, ఈతరం వారికి తెలియదు. కవితా ఖండాలను ఒకచోట గుదిగుచ్చి అచ్చుకిచ్చివేయడమే కదా - ఇందులో ఏమంత కష్టముంది? అని చప్పరించేవాళ్ళు ఆనాడూ ఉన్నారు; ఈనాడూ ఎవరైనా ఉంటే ఉండవచ్చు.

''వైతాళికులు'' సంకలనంలో మొదట ఆయన ఎదుర్కొన్న సమస్య ఆనాటి కాల్పనిక! కవితలో, నవ్య సాహితిలో ఏర్చికూర్చే కవితలు ఒకే ధోరణిని ప్రతిబింబించే దశకు చెందినా, రచనలో భావనలో వైవిధ్యం ఉండాలి; రచనా పరిణతిని ప్రతిబింబించాలి. ఈ లక్ష్యంతో ఈ సంకలనానికి కృషి చేస్తున్నప్పుడు, రచయితలనుండి తానాశించినంత ప్రోత్సాహ ప్రోద్బలాలు లభించకపోయినా నిరుత్సాహపడలేదు ముద్దుకృష్ణ. ఆనాటి విషయాలను ముచ్చటిస్తున్న సందర్భాలలో ఎన్నోసార్లు యీ విషయం చెప్పారు. ఇటీవల విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ''వైతాళికులు'' పునర్ముద్రించుతున్నప్పుడు కూడా ఆయన పడినశ్రమ నేనెరుగుదును. ఫోటోలకోసం, రచయితల జీవిత విశేషాలకోసం ఇదివరకు అసమగ్రంగా ఉన్న లోపాన్ని తీర్చడానికి, ముద్రణకాలం నాటికి తాజా సమాచారాన్ని సమకూర్చడానికి ఎంతో పట్టుదల చూపాడాయన. ఎంతో శ్రమించాడు. ఎంతో ఓర్మి వహించాడు. ఐనా ఇంకా అక్కడక్కడ ఏవో పొరపాట్లు, స్వల్పలోపాలు, ఏదో కొంత అసంతృప్తి.

ముద్దుకృష్ణ ఇకలేడు. 1973 ఫిబ్రవరి 6వ తేదీన కన్నుమూశాడు. ఐనా ''వైతాళికులు'' తదితర రచనలలో ఆయన నిత్యం జీవించే ఉంటాడు.

ముద్దుకృష్ణ 1899 ఫిబ్రవరి 7వ తేదీన జన్మించాడు. వితంతు వివాహం మొదలైన సంఘ సంస్కరణలను ప్రతిపాదించడమేగాక, వ్యావహారికాంధ్రంలో ''హితసూచని'' అనే గ్రంథాన్ని 1840లోనే రచించిన ముద్దు నరసింహంగారు ముద్దుకృష్ణగారి ముత్తాత. తండ్రిగారు కూడ వీరేశలింగంగారి అనుయాయులు. బాల్యంలోనే ఈ కుటుంబ వాతావరణ ప్రభావం ముద్దుకృష్ణగారిపై పడింది.

చిన్నతనంలోనే తెలుగు సాహిత్యంలో ముద్దుకృష్ణగారికున్న అభిరుచిని పసిగట్టిన తండ్రిగారు మనుచరిత్ర, వసుచరిత్ర బోధించారు. స్కూల్‌ఫైనల్ చదివేనాటికి ఆంగ్ల సాహిత్యంలో కూడా ఆసక్తి పెరిగి, 'మర్చంట్ ఆఫ్ వెనిస్' నాటకంలో అభినయించే స్థితికి వచ్చాడు.

కాలేజి చదువు కాకినాడలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారివద్ద కొద్దికాలం మాత్రం జరిగింది. తర్వాత రాజమండ్రిలో చేరాడు. ఇక్కడ

పట్టభద్రుడయేసరికి సంస్కృతాంగ్ల సాహిత్యాలలో పరిచయమూ, పరిజ్ఞానమూ కల్గాయి.

1920 నాటి జాతీయోద్యమ ప్రభావంవల్ల స్వాతంత్ర్యాభిలాష కల్గింది. ఇదే 1932-1933 జాతీయోద్యమంలో పాల్గొనడానికి ప్రేరేపించింది.

భావ కవితాయుగానికి చెందిన దేవులపల్లి కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులు, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి (శివశంకరస్వామి) మొదలగువారితో సాన్నిహిత్యం; కళాశాలల్లోని ఇంగ్లీషు నాటక ప్రదర్శనలూ, స్థానిక నాటక సమాజాల తెలుగు నాటక ప్రదర్శనలూ, సుప్రసిద్ధ కవీ, నటుడూ హరీన్ ఛటోపాధ్యాయతో కలిసి 1927 ప్రాంతాలలో కళాప్రదర్శనలు, ముద్దుకృష్ణ గారిలో నాటకరచనలకు ప్రేరేపించాయి.

'అశోకం' నాటకం ద్వారా ముద్దుకృష్ణ అపూర్వ సంచలనం కల్గించాడు. అంతకుముందు కవిరాజు త్రిపురనేని రామస్వామి, గుడిపాటి వెంకటచలం, ఇలాంటి తిరుగుబాటు తత్వాన్ని ప్రబోధించినందుకు సనాతనుల దూషణలకు గురి అయ్యారు. ఇపుడు 'అశోకం' ద్వారా ముద్దుకృష్ణ వంతు వచ్చింది. ఐనా జంకక ఈ నాటకాన్ని ప్రదర్శించాడు కొన్నిచోట్ల ముద్దుకృష్ణ

1934 సెప్టెంబర్‌లో ప్రారంభించిన ''జ్వాల'' పత్రిక యువకులలో కొత్త ఆలోచనలను రేపింది. పత్రికా రచనలోను, నిర్వహణలోను కూడా ''జ్వాల'' కొత్తపుంతలు తొక్కింది. ఐతే అది ఎంతోకాలం నిలవలేదు.

1935 తర్వాత కొన్నాళ్ళు సినిమా రంగంలో కూడా పనిచేశాడు. నిర్మాతలకు డబ్బు గడించిపెట్టిన చిత్రాలు కూడా ఉన్నాయి. కాని సినీరంగంలో ఎంతోకాలం నిల్వలేకపోయాడు.

ముద్దుకృష్ణ బ్రహ్మచారి. ఈ బ్రహ్మచారి రాసిన ''దాంపత్య దీపికా'' శాస్త్రీయ విషయాలతో నిండి, ఎందరి ప్రశంసలనో పొందింది.

ఒకప్పుడు సంపన్న కుటుంబంలోనే జన్మించి ఉండవచ్చు. కాని ముద్దుకృష్ణకు చివరి దశలో రేపెమిటి అన్న ప్రశ్న ఎదురౌతూనే వచ్చింది. ఆయన ఎప్పుడూ అంటూ ఉండేవాడు, బంధువులకు తాను భారం కాకూడదని. అందుకే మిత్రులపై ఆశలు పెట్టుకొనేవాడు. ఒక్కొక్కసారి ఆయన పొందిన ఆశాభంగం తాలూకు ఉదంతాలు స్వయంగా ఆయన చెప్పకపోయినా విన్నప్పుడు ఎంతో విచారం కల్గేది.

ఈ సమాజంలో రచయితకు భద్రత ఎక్కడ? కేవలం రచనా వ్యాసంగంపై బ్రతకగల్గేవాళ్ళెంతమంది?

ఈ స్థితిలోనే కొద్ది సంవత్సరాలక్రితం ఆయన తన రచనలను పునః ప్రచురించవలసిందని అడిగినప్పుడు, అందుకు సంసిద్ధపడిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌కు వ్యాపారదృష్టి అడ్డు రాలేదు. ఏ ఒకటో రెండో తప్ప, అవి కూడా ఆయన తిరిగి రాయాలని భావించడంవల్ల – అన్నీ ప్రచురించింది.

మూడు నాల్గు దశాబ్దాలుగా ముద్దుకృష్ణ సాహిత్య వ్యాసంగ పరిచయం ఉన్నా అప్పుడప్పుడూ ఏదో సందర్భాన కలుస్తూ ఉన్నా, ఇటీవల కొద్ది సంవత్సరాలలోనే

ఆయనతో ఎక్కువ పరిచయం ఏర్పడింది. సాహిత్యరంగ స్మృతులను ఆయన ముచ్చటిస్తున్నప్పుడు, అవన్నీ ''మీరెందుకు గ్రంథస్థం చేయరు'' అని అడిగితే, ''నిజంచెబితే నిష్ఫలం, ఎందుకు లేనిపోని తగాదాలు. మనకు కావాల్సింది రచయితల జీవితాలు కాదు, వారి రచనలు'' అంటూ ఉండేవారు. పేరులోనేకాదు ముద్దు, ఆయన తెలుగులోగాని ఇంగ్లీషులోగాని ఉత్తరం రాస్తే ముత్యాలలాంటి అక్షరాలు ముద్దుముద్దుగా కన్పించుతాయి. ముద్రణ విషయంలో ముచ్చటగా ముద్రించాలన్న ఆయన అభిరుచికి ''ఉమర్ ఖయ్యాం'' చూస్తే చాలు.

ఇక ఎంత విచారించినా ముద్దుకృష్ణ భౌతికంగా లేడు, కాని తన రచనల ద్వారా ముద్దుకృష్ణ మనకు సాక్షాత్కరించుతూనే ఉంటాడు.

1973, మే. **- తుమ్మల వెంకట రామయ్య**

★ ★ ★

# జన్మభూమి

ఏ దేశమేగినా, ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని,
నిలుపరా నీ జాతి నిండు గౌరవము!

ఏ పూర్వపుణ్యమో, ఏ యోగబలమొ,
జనియించినాడ వీ స్వర్గఖండమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావొ
నిను మోచె ఈ తల్లి కనకగర్భమున!
లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు!

సూర్యుని వెలుతురుల్ సోకునందాక,
ఓడల జెండాలు ఆడునందాక
నరుడు ప్రాణాలతో నడుచునందాక,
అందాక గల ఈ యనంత భూతలిని
మన భూమి వంటి చల్లని భూమి లేదు!
పాడరా నీ తెన్గు బాలగీతములు
పాడరా నీ వీర భావభారతము!

తమ తపస్సులు ఋషుల్ ధారపోయంగ,
శౌర్యహారము రాజచంద్రు లర్పింప,
భావ సూత్రము కవిప్రభువు లల్లంగ
రాగదుగ్ధము భక్తరత్నముల్ పిదుక
దిక్కుల కెగదన్ను తేజమ్ము వెలుగ
రాళ్ళుతేనియలూరు రాగాలు సాగ
జగముల నూగించు మగతనం బెగయ
సౌందర్య మెగబోయు సాహిత్య మలర
వెలిగిన దీ దివ్య విశ్వంబు పుత్ర!
దీపించె నీ పుణ్యదేశంబు పుత్ర!
పొలములు రత్నాలు మొలిచెరా యిచట
వార్ధిలో ముత్యాలు పండెరా యిచట

పృథివి దివ్యోషదుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు
అవమాన మేలరా, అనుమాన మేల,
భరత పుత్రుండ నంచు భక్తితోఁ బలుక!

రాయప్రోలు

# దేశభక్తి

దేశమును ప్రేమించుమన్నా,
మంచి అన్నది పెంచుమన్నా;
వొట్టిమాటలు కట్టిపెట్టోయి
గట్టిమేల్ తలపెట్టవోయి!

పాడి పంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటుపడవోయి;
తిండి కలిగితె కండ కలదోయి
కండగలవాడేను మనిషోయి!

యీసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయిచ?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నింపవోయి!

అన్ని దేశాల్ క్రమ్మవలెనోయి
దేశి సరుకుల నమ్మవలెనోయి;
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయి!
వెనక చూసిన కార్య మేమోయి?
మంచి గతమున కొంచెమేనోయి
మందగించక ముందు అడుగేయి!
వెనకపడితే వెనకేనోయి!

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే;
వ్యర్థకలహం పెంచబోకోయి
కత్తివైరం కాల్చవోయి!

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయి
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయి!

ఓర్వలేమి పిశాచి, దేశం
మూలుగులు పీల్చేసెనోయి
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి!

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి?
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయి!
దేశమంటే మట్టికాదోయి,
దేశమంటే మనుషులోయి!

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి,
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి!

మతం వేరైతేను యేమోయి?
మనసులొకటై మనుషులుంటే
జాత మన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి!

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి,
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి!

ఆకులందున అణగిమణగీ
కవిత కోయిల పలకవలెనోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయి!

గురజాడ

# స్వాతంత్ర్య రథము

అంబుదంబుల నమృతపూరంబు లొలుక
నింద్రచాపంపుదోరణ మింపుఁగులుక
గాలిమెలుగులు నెల్లెడ గడలుకొనగ
వెడలె స్వాతంత్ర్యరథము విన్వీధియందు!

జలధరమాల జీల్చికొని స్యందనకాంతి
నభోంతరాళ ముజ్జ్వలితముచేసి, యంధ
తమసంబులు పాఱిన మూలనైన శోభల
ననలెత్తజేయుచు, బ్రభాతవిభాకర బింబమట్లు
సొంపిలుచు, నవీనజీవనము వింతగ నింపె
సమస్త సృష్టిలోన్!

ఆ రథమందు దీప్తమయమ్మై కనుపట్టె
నిజప్రభావ దుర్వార పవిత్రమూర్తి
కనుపండువు సేయుచు; ధర్మజీవనాకారమొ,
శాంతిబింబమొ, యకల్మష సత్యనికేతనంబొ,
సంసారఫలస్వరూపమొ, ప్రజాహృదయంబొ
యనన్ వెలుంగుచున్!

ఒకచేతన్ రుధిరంపు బాత్రమును,
వేరొక్కంట బీయూషపాత్రికయుం గైకొని,
'సభ్యతామిషమునన్ దేశంబులందెల్ల నింతకు
ధర్మంబులుగాగ నెన్నబడు నన్యాయంబు
లీనాటితో వికలంబై చనుగాక' యంచు
గరుణావేశమ్ము దీపింపఁగన్!

పచ్చి నెత్తురు నమృతంపు బాత్రబోసి
దివ్యదుగ్ధంబుగా మార్చె దేవిమహిమ,
హాలహాల గర్భమందైన నమృతరసము
సంభవించు నటంచిల జాటనేమొ!

నిలువదు స్యందనంబు ధరణీపతి పాలన
దండభీతిచే, నిలువ దనాథబాష్పములు
నిల్చిన పల్లపునేల, మోసగింపుల మఱపించు

క్రించు దనపుంజతురాత్మల కాగబో,
దనర్గళజవ మొప్ప నేగెడివి గన్నులకుం
గనరానిచోటికిన్!

పూర్వసింహాసనంబులు, ప్రోజ్జ్వలంపు
మణిమయకిరీటములు, భోగమందిరములు
చక్ర సంఘర్షణంబున జదిసిపోయి
యవి యివి యనంగరాక రూపటెడు నేడు!

లేవు దివ్యతురంగముల్, లేవు కరులు,
ప్రజలె యా తేరు మోకుల బట్టువారు,
వాయుజవమునఁ దారకాధ్వమున నేగు
నంతరాయశతంబులనైన దాటి!

తేరు జాడల నెత్తురు పాటిపాటి
బంగరుంబంట పండించె బక్కనేల,
జక్రనేములు దాకిన స్థలము లెల్ల
సస్యలక్ష్మికి గల్యాణశాల లయ్యె!

స్యందనాసీన యగు దేవి ''శాంతి శాంతి'
యనుచు మంజుల గానమ్ము నలరజేసి
నవ్య నక్షత్ర వీణాస్వనమ్ములందు
మేళవించెను జనులు విస్మితులుగాగ!

రామిరెడ్డి

# ఆంధ్ర పౌరుషము

గోదావరీ పావనోదారవాఃపూర
మఖిల భారతము మాదన్న నాడు,
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
కవులగానము శ్రుతి గలయు నాడు,
పెన్నానదీ సముత్పన్న కైరవదళ
శ్రేణిలో తెన్గు వాసించు నాడు
కృష్ణా తరంగ నిర్నిద్ర గానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు!

అక్షరజ్ఞాన మెఱుగదొ యాంధ్రజాతి,
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు!

విశ్వనాథ

# ప్రబోధము

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు,
ఓరుగల్లున రాజవీర లాంఛనముగ
బలు శస్త్రశాలలు నిలుపునాడు,
విద్యానగర రాజవీథుల గవితకు
పెండ్లిపందిళ్ళు గప్పించునాడు;
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయ స్తంభ మెత్తించునాడు

ఆంధ్రసంతతి కే మహితాభిమాన
దివ్యదీక్షాసుఖస్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి యాంధ్రులార
చల్లు డాంధ్రలోకమున నక్షతలు నేడు

తన గీతి యఖిలజాతిని పాటకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి,
తన పోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరిసిన తెనుగుకత్తి,
తన యందములు ప్రాంతజనుల కభిరుచివా
సన నేర్ప నలరిన తెనుగురేఖ,
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లనుచేయ జెలగిన తెలుగుభూమి

అస్మదార్ద్ర మనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ; చావలేదు,
చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చదువుడో సదయులార!

కృష్ణాతరంగ పంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాడు
ఇంటింట దేశిసాహిత్య దీపములతో
నాంధ్ర తేజస్సు రాపాడునాడు,
సుకుమార శిల్పవస్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాడు,
సమర సేనావ్యూహ జయపతాకల క్రింద
నాంధ్ర పౌరుషము చెండాడునాడు,

చూచి, సంతోషమున తలలూచి, గర్వ
మాచి, ఆంధ్ర పుత్రీపుత్రు లందగలరు
శాంతి, నందాక లేదు విశ్రాంతి మనకు,
కంకణ విసర్జనల కిది కాల మగునె!

రాయప్రోలు

# నైవేద్యము

తల్లి, నీ యుత్సవము గాంచ దరలినార
లనుగు దనయులు నైవేద్యహస్తు లగుచు
ధన్యు లెల్లరు నాత్మోచితంపు గాన్క
లర్పణము సేయ వచ్చిరి యందికొమ్ము!

స్వర్ణ సుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీ పాదపద్మములకు,
ఏమిలేనట్టి భిక్షుకుండేని నేడు
కంటి క్రొన్నీటి ముత్యాలకాన్క లిడును!

పూజ్యు, లధములు, ధనికులు, పుట్టుబీద
లనెడి యెడలేక యెత్తిరి హారతులను,
భక్తి పరవశులైన యీ ప్రజలగీతి
దిక్కు దిక్కులయందు బ్రతిధ్వనించు!

అమ్మరో! నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండగణము,
త్యాగ పరిశుద్ధమగు నాత్మ దలగిపోవు
కామమటు భూమరేఖలు గడలుకొనగ!

ప్రొద్దుపొడుపున, నీ పాదపూజకొఱకు
కవిని, తెచ్చితి దోసిట గన్నెపూలు,
బలివితర్దిక నిరతంబు వెలుగునటుల
హృదయపు సుగంధదీప మర్పింతు గొనుము!

**రామిరెడ్డి**

# వేఁగిక్షేత్రము

ఏ రాజు పంచెనో యిచట శౌర్యపుపాయ
సమ్ములు నాగులచవితినాళ్ళ
ఏ యెఱ్ఱసంజలో నెలమి పల్లవరాజు
రమణులు కాళ్ళ బారాణు లిడిరొ
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో
తెలుగు పిల్లలు కత్తి త్రిప్పి రెపుడొ
ఏ రెండు జాముల యినుని వేడిమి వచ్చి
కలిసిపోయెనో త్రిలింగ ప్రభువుల

నా జగచ్ఛ్రేయసంబులై యలరు తొంటి
వేంగిరాజుల పాద పవిత్రచిహ్న
గర్భితమ్మైన యీ భూమిఖండమందు
నశ్రువులు జార్చు జీవచ్ఛవాంధ్ర జనులు!

ఇట వేఁగీశుల పాదచిహ్నములు లేవే లేవుపో!
భావనాస్ఫుటమూర్తిత్వమునైన బొందవు నెదో
పూర్వాహ్ణ దుష్కాలపుం ఘటికల్
గర్భమునం దిముడ్చుకొనియెం గాబోలు
నీ పల్లెచో టట లోకాద్భుత దివ్యదర్శనమటే
యా భోగ మేలాటిదో!

నీ యతుల ప్రభావమహనీయత
వేఁగి పురాధిరాజమా: అయుతధర్మమూర్తులు
మహాత్ములు వారలు బ్రహ్మకోశ గోపాయిత
లాంధ్రపల్లవనృపాలుర హుంకృతి
వ్యాఘ్రగర్జనగానై యరిలోక భీకర మహాద్భుత
శౌర్యరసాకృతిం జనెన్!

ఈ నా పదార్పితక్షోణి నేరాజు ధ
ర్మాసనంబున స్మృత్యర్థ మనెనొ
ఈ నా దృగాతంబైన భూములలోన
నే శౌర్యధనులు శిక్షింపబడిరొ
ఈ నా శరీరమం దివతళించిన గాలి
యెంత పౌరాతన్య మేచుకొనెనొ
ఈ నా తనూపూర్ణమైన యాకాశమ్ము
నే క్రతుధ్వనులు శబ్దించినవియొ

అస్మ దజ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్పు
నీ పునీతావనీఖండ మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నా యాంధ్రశక్తి
నన్ను గంపింప జేయుచున్నది భృశమ్ము

వేగిరాజ్యపు పల్లెవీథుల చెడుగుళ్ళ
రిపుల గర్వించు నేరుపులు తెలిసి
ఎగురు గోడీబిళ్ళ సొగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు డాసి
చెఱ్ఱాడి యుప్పు తెచ్చిననాడె శాత్రవ
వ్యూహముల్ పగిలించునొఱపు గఱచి
కోతికొమ్మచ్చిలో కోటగోడల కెగ
బ్రాకి లంఘించు చంక్రమణ మెఱిగి

తెనుగు లంతస్థై యవి నేర్చుకొనియయుందు
రెన్నగా దెల్గుతల్లులు మున్ను శౌర్య
రస మొడిచి యుగ్గు బాలతో రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదు రట!

శిలవోలెన్ కదలంగలేక హృదయస్నిగ్ధార్ద్ర
సద్భావనాఖిల చైతన్యుడనై పురావిదిత
వేంగీ పూజ్యసామ్రాజ్యగాథల యోజించుచు
నాంధ్రపల్లవ నరేంద్రశ్రీయశ స్తంభమున్ బలె
నిల్చుంటిన యీ పవిత్రధరణీభాగంబునం దీగతిన్!

ఏ దివ్యపూరుషు లీ శాద్వలాంకూర
శేఖరమ్ముల లిఖించిరొ యివెల్ల
ఈ వాయువీచిలో నే యప్సరస్సమా
జము నింపిరో గీతిసముదయంబు
ఏ దివ్యశిల్పు లీ రోదసీ కుహరాన

వ్రాసిరో దివ్యశిల్పంబు లిన్ని
ఈ పథాంతరమునందే పురాణమునీంద్ర
సంతతులో ప్రశంసలు పొనర్చి

ఎట గనిన బూర్వ పల్లవ నృపచరితలె
వ్రాయబడి, పాడబడి, గీయబడి, యుపన్య
సింపబడి శ్రోత్రపేయమై చెన్నుదాల్చె
నీ యతీంద్రియశక్తి నా కెట్లు లబ్బె!

ఈ పొలా లెంత చే వెక్కించుకొన్నవో
గుండెవ్రయ్య సముద్రగుప్తుడడలె
ఈ నేల పావిత్ర్య మెంత కుంభించెనో
చిత్రరథస్వామి సేవలు కొనె!
ఇట పల్లవుల రాచయెలనాగ లే వ్రత
మ్ములు చేసిరో లచ్చి నిలుకడవడె,
ఈ కాశ్యపీఖండ మే శరజ్జ్యోత్స్నలో
పులకించెనో, కీర్తి తెలుపులూరె

ఇట నెచట త్రవ్వినను బంగరేనట యది
యెంత శ్రీయొ యదెంత రాజ్యేందిరయొ
దానత నఖాగ్రపాత నిర్యన్నిధాన
మైన ఈ చోట నుపభోగ్యమయ్యె నేడు!

ఈ పొదలం జరించుచు నహీన మహా
మహిమానుభావమౌ నే పురవీథులందో
చరియించుచునుంటి నటంచు బారతంత్ర్యా
పతితుండ నయ్యును పురామహదాంధ్రమునన్
స్వతంత్రుడౌ నే పురుషుండనో యనుచు నీ భ్రమ
సత్యముగా తలంచుదున్!

ఏ పల్లవ నృపాలు డెత్తిన బావుటా
చాళుక్యనృపుల రాజ్యంబునందు
ఏ దేశికవిత పాలించిన కవిరాజు
నన్నయ్య వ్యాకరణంబునందు
ఏ యులిజెక్కు నేర్పులు మహాశిల్పి
గోదావరీనదీ ఘోషయందు
ఏ తొంటి తెలుగుల యెక్కు వాచారమ్మ
బలవన్నృపుల ప్రాభవమ్మునందు

సమసిపోయెనొ ఉన్మత్తసామజంబు
కొలను జొరబడి తమ్మితూడులను పెరికి
వైచుటె యెఱుంగుగాని తత్పద్మగర్భ
కేసర విమిశ్ర మధురసాగ్రియత గలదె?

ఇమ్ముగ గాకుళమ్ము మొద లీవరకుంగల
యాంధ్రపూర్వ రాజ్యమ్ముల పేరు చెప్పిన
హృదంతర మేలొ చలించిపోవు
నార్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవనిర్ణయమేని
ఎన్ని జన్మమ్ములుగాగ నీ తనువునన్
బ్రవహించునొ యాంధ్రరక్తముల్!

ఇది వినిపింతునంచు మది నెంచెద మిత్రులకున్
గళస్థ గాద్గదికము లోచనాంత
బహుధాశ్రుత బాష్పనదమ్ము స్పందనాస్పద
హృదయమ్ము నా పనికి జాలక చేసెడు నన్ను
నింతగా నెద పదిలించుకొన్న దిది యెక్కడి
పూర్వపు జన్మవాసనో!

విశ్వనాథ

# కాంక్ష

ఈ సుమజన్మ మెట్లొ ఘటియిల్లెను నా
కొకనాటి పాటిదై, వాసన లీను సోయగము
వాయని తీయని పోడుముల్ క్షణంబో, సగమో
విచార పడబో నయినన్ విడివడ్డ నా యెదన్
మోసులువారు నూతన మనోరథ మామని వేడి పొంగులన్!

పేదల రక్తమాంసముల బెంపు వహించి
దయారసాసుధాస్వాద దరిద్రులైన ధనవంతుల
పెద్దరికమ్మునకై, మతోన్మాదము పెంచు దేవునికి
మారుగ నిలిచిన రాతి బొమ్మలం దూదరవోవు
పాడుబ్రదు కొక్క నిమేషము సైప నా యెదన్!

నాకు దలంపులేదు లలనాజనతా కబరీభరైక
భూషాకలనన్ సతీ మృదు భుజాంతర తల్ప

కుచోపగూహబిబ్బోకమునన్, వధూసిత
కపోలగళ చ్ఛ్రవణా వతంస, హేవాకమునన్
విలాసినుల పాపట చందిర కావిపూతలన్!

కానుపనై ధరాధిపుల కాళ్ళకడం
బొరలాడి వాడిపోలేను, ధరాపరాగపటలీ
మలినమ్మగు ద్వార తోరణా స్థానమునం
దురిం బడగజాలను, దోసిటిపేరి ఘోరకారా
నరకమ్మునం దుసురు రాల్పగలేను నిమేష రక్తికై!

తేనెలకోసమై కొదమ తేటులదాటు లొనర్చు
నృత్యగీతాను నయమ్మగాని, మలయానిలు కౌగిట
బుల్కరించు సౌఖ్యానుభవమ్ము గాని,
తరుణారుణరాగ కదుష్ణచుంబనశ్రీ
నవకమ్ముగాని, పరితృప్తి యొసంగవు నాకొకింతయున్!

నీచపు దాస్యవృత్తి మననేరని శూరత
మాతృదేశ సేవా చరణమ్మునం
దసువులర్పణ సేసిన వారి పార్థివశ్రీ
చెలువారుచోట, తద స్రగ్గుచులన్ వికసించి,
వాసనల్ వీచుచు రాలిపోవగవలెం
దదుదాత్త సమాధి మృత్తికన్!

వేదుల

# పృథివీ ప్రశంస

ఓ విశాలావనీ
శోభాతిపావనీ

ఆరంభపుణ్యక్షణముల నీశుడు విసరిన నాటి
నీ యాది సౌభాగ్యమెటుల వెల్గెనో? భవదీయశాటి

ఆకుపచ్చని యాకులో
పండువెల్తురు రేకులో

నిన్ను ప్రశ్నింపగాజాల, నీనాటి ప్రొద్దుటిపూట
గంభీరమై ప్రవహించె నీదు సౌందర్యంపు పాట

ఓ విశాలావనీ!
శోభాతిపావనీ!
కాంతికల్లోలినీ!
వైభవశాలినీ!

సీతాసతీవేణి నడగి వాడిపోవని పూవు బోలి
దినదినాపూర్వమై పొడుచు, తావకీనవిభాత కేళి

ప్రాభాతగానమ్ములా?
నీ యస్తమానమ్ములా?

ఏవి సుందర తరమ్ములొకొ? యెట్టి గీతాపరిమళము
ఆనందవీథి నాడించు నీ హృదయ సరోజదళము

కాంతికల్లోలినీ!
వైభవశాలినీ!
ధవళయశోవతీ!
ఆ!

పాఱెడు కాల్వలచెంత వీచెడు గాడ్పుల వినుచు
నీ యుదాత్తలలాట రేఖ పులకలు సూప కన్గొనుచు

త్వచ్ఛాయమానమ్ములై
శ్యామాయమానమ్ములై

దవ్వులనున్న వెదుళ్ళు కలిసి కంఠములెత్తి పాడ
తల్లి, నీ యొడిలోన నడగి యల్లరిలేక విన్నాడ

ధవళయశోవతీ!
స్నిగ్ధతేజోవతీ!
హే నవమోహినీ!
హే దయావాహినీ!

చూడ సుందరములై యడరు నా శృంఖలమ్ముల ద్రెంచి,
నా మేలివాకిళ్ళ దాటి, విందు నీ మధుర విపంచి

బంగారుతోరమ్ములన్
నా రత్నహారమ్ములన్

గైకొని, నా కిమ్ము జనని నీ మృత్తికారేణుకణము,
శాద్వలశ్యామలవీథి వికసించు పచ్చ ప్రాంగణము!

హే నవమోహినీ!
హే దయావాహినీ!

అబ్బూరి

# భవిష్యద్దర్శనము

సందె ముత్తైదువ సరిగవలిపంబు
వరివెన్ను పాపలు పట్టి లాగంగ,
వాత్సల్యమున బైకి వంగెనో యనగ
చెంగావి నిగ్గులు చేలపై నలమె;

ఈ రామణీయక మీక్షించి యింట
గాలు నిలువక యూరికడపట నున్న
పొలమున విహరింపబోతి నొంటరిగ,
దిన్న తిన్నగ వీచు తెమ్మెరలవలన
వెన్నులు బంగారు వీధులై రేగె!

కాంతియు గానంబు గలసి యనూహ్య
మగు నింద్రియ విషయమ్మై కానిపించె;
అచ్చోట నానంద మనుభవించుచును
నొక్కింత కూర్చుండియుంటి నిశ్చలత;

అంతలో గెంజాయ లంతరింపంగ
గప్పెను బ్రకృతి నక్షత్రసంఖచిత
కోమల తిమిరావగుంఠనాంబరము;
గాలి వీచుట మానె; గదల వాకులును
అమ్మ పేరెదనాడి యలసి కనుమోడ్చు
పసికూనలటు సరోవర మధ్యమందు
నిశ్చలశాంతిమై నిదిరించు నలలు,
గాంభీర్యమును దాల్చె గగనతలంబు;

సగము జాగ్రదవస్థ, సగము స్వప్నమున
భావించుచును గట్టుపైన గూర్చుంటి;

సత్యమో, భ్రాంతియో, స్వప్నంబో కాని
యింద్రజాలము వోలె నెదుట గన్పట్టె!
అది సత్యమైయున్న నాశ్చర్యకరము!
అది కలయేయైన నానందమయము!

మావి తోటను బర్ణమండపమందు
జనరంజకంబైన సభ యొండు జరిగె,
మొగిలిరేకులు, తమ్మిపూ దోరణంబు,
లందంబు నెత్తావి నర్పించుచుండె;

రారాజు క్రొంబచ్చరాగద్దె డిగ్గి
యందఱితోబాటె యవని గూర్చుండె;
బనిపాటు లేనట్టి బంటు సిపాయి
త్రుప్పుపట్టిన కత్తి తుంటిపై రాయ
దనపూర్వజయముల దలపోయుచుండె;

బురద చిట్టలుపడ్డ పుట్టముల గాపు
వర్తించె నృపపరివారంబు గలసి;
కూలి నాలి యొనర్చి కుడుచు నిరుపేద
యజమానిసరిబంతి నాసీనుడయ్యె;

సకలమానవజాతిసంతతులు కుల
వర్ణ భేదంబుల బాటింపబోక
యొక్క కడుపున బుట్టి యొక చన్నుబాలు
ద్రావినరీతి, సౌందర్యంబు గలిగి
యన్యోన్యసాహాయ్య మర్థించువారు!

స్ఫటికపాత్రంబున శాంత్యాసవంబు
ధర్మదేవత తెచ్చి తనిపె నందఱిని
ఏక కుటుంబమై యీ ప్రపంచంబు
స్వర్గంబు భూమిపై స్థాపింపబడియె!

అభ్యుదయాంశువు లన్ని మూలలను
నవనవోజ్జ్వలజీవనంపు దీపముల
వెలిగించుచుండె; నీ విశ్వమంతయును
మానవకల్యాణమందిరం బయ్యె!

అంతలో లౌకిక యాదార్థ్యములను
భావంబు వ్రాలెను బక్షివిధాన,

బొగ్గు కంబములట్లు పొడకట్టుచుండె
దత్ప్రాంతములనున్న తాళవృక్షములు,
చిమ్మచీకటి నోంటి జిక్కుకొనియుంటి!

రామిరెడ్డి

# ఆతిథ్యము

ఆగు మాగుము తెరువరీ, ఆ
యాసఖేదము నపనయింపుము
మా గృహాంగణకుసుమసముదయ
మధువు లియ్యవిగో!

నీరజాప్త నిశాతకిరణో
న్మీలితములై పరిమళించెడు
వారిరుహముల గుమ్మరిలిన తు
షార మియ్యదియే!

మావిపూగుచ్ఛముల నసకృ
న్మత్త మధుపచయమ్ము లాడగ
బ్రోవుపడిన పరాగమ్ముదుల వి
భూతి యియ్యదిగో!

తూరుపున సింధూరరాగము
దోలుక, తొయ్యలు లేరి తెచ్చిన
పారిజాత ప్రసవమాలా
బహుళ మియ్యదియే!

ఆగు, మాగుము తెరువరీ, ఆ
యాసఖేదము నపనయింపుము,
మా గృహాంగణ కుసుమసముదయ
మధువు లియ్యవిగో!

వెంకటసుబ్బయ్య

# సాధుగీతి

లతాంతాగ్రరాగమ్ములన్ బాడు తేటుల్
వసంతమ్ము కాంతి ప్రవాహమ్ము లందున్
నిసర్గాప్త శోభావినీతిం బ్రియమ్మై
కనుల్గట్టు చందాన గాన్పించు పూవుల్
కనుంగొన్నచో, వేడికన్నీళ్ళు రాలున్,

అలంకారము ల్లేని యాపూల ముగ్ధో
క్తులన్ లీనమైపోయెదో, సాధుగీతి!

కవిప్రేమ పుష్పింపగా జేయు కృష్ణా
స్రవంతీ తరంగాంతరంగమ్ము జూడన్
హతస్వాంతయై, దీనయై, తీరభూమిన్
వెతల్విప్పి వాపోవవీక్షించు, కన్యా
మణీశోకమూర్తి శ్రమల్గన్న రాగా
రుణమ్మైన చింతాఝరుల్ వాఱు నాత్మన్,

అలంకారముల్లేని ఆ కన్నె శీతా
ర్తులన్ లీనమైపోయెదో సాధుగీతీ!

అబ్బూరి

# ఎవరు?

ఎవరోహో, ఈ నిశీథినెగసి, నీడవోలె నిలిచి,
పిలుతు రెవరో, మూగకనులు మోయలేని చూపులతో!
ఎవరోహో! ఎవరోహో!

ఇపుడా నను బలుకరింతురు!
మ్రోయలేని నీరవగళమున చలించు కోరికతో
ఇపుడా నను బలుకరింతురు!
ఎవరది ఈ రేయి నిదురు హృదయ మదర, వేయి చేయి
చాయలాడ పెనుచీకటి సైగలతో నా కన్నుల
రక్తమురల లాగికొందురు!

గైకొని, నా కిమ్ము జనని నీ వృత్తికారేణుకణము,
శాద్వలశ్యామలవీథి వికసించు పచ్చ ప్రాంగణము!

హే నవమోహినీ!
హే దయావాహినీ!

అబ్బూరి

# భవిష్యద్దర్శనము

సంజె ముత్తైదువ సరిగవలిపంబు
వరివెన్ను పాపలు పట్టి లాగంగ,
వాత్సల్యమున బైకి వంగెనో యనగ
చెంగావి నిగ్గులు చేలపై నలమె;

ఈ రామణీయక మీక్షించి యింట
గాలు నిలువక యూరికడపట నున్న
పొలమున విహరింపబోతి నొంటరిగ,
దిన్న తిన్నగ వీచు తెమ్మెరలవలన
వెన్నులు బంగారు వీఘలై రేగె!

కాంతియు గానంబు గలసి యనూహ్య
మగు నింద్రియ విషయమ్మై కానిపించె;
అచ్చోట నానంద మనుభవించుచును
నొక్కింత కూర్చుండియుంటి నిశ్చలత;

అంతలో గెంజాయ లంతరింపంగ
గప్పెను బ్రకృతి నక్షత్రసంఖచిత
కోమల తిమిరావగుంఠనాంబరము;
గాలి వీచుట మానె; గదల వాకులును
అమ్మ పేరెదనాడి యలసి కనుమోడ్చు
పసికూనలటు సరోవర మధ్యమందు
నిశ్చలశాంతిమై నిదిరించు నలలు,
గాంభీర్యమును దాల్చె గగనతలంబు;

సగము జాగ్రదవస్థ, సగము స్వప్నమున
భావించుచును గట్టుపైన గూర్చుంటి;

సత్యమో, భ్రాంతియో, స్వప్నంబొ కాని
యింద్రజాలము వోలె నెదుట గన్పట్టె!
అది సత్యమైయున్న నాశ్చర్యకరము!
అది కలయేయైన నానందమయము!



మావి తోటను బర్ణమండపమందు
జనరంజకంబైన సభ యొండు జరిగె,
మొగిలిరేకులు, తమ్మిపూ దోరణంబు,
లందంబు నెత్తావి నర్పించుచుండె;

రారాజు క్రొంబచ్చరాగద్దె డిగ్గి
యందఱితోబాటె యవని గూర్చుండె;
బనిపాటు లేనట్టి బంటు సిపాయి
త్రుప్పుపట్టిన కత్తి తుంటిపై రాయ
దనపూర్వజయముల దలపోయుచుండె;

బురద చిట్టలుపడ్డ పుట్టముల గాపు
వర్తించె నృపపరివారంబు గలసి;
కూలి నాలి యొనర్చి కుడుచు నిరుపేద
యజమానిసరిబంతి నాసీనుడయ్యె;

సకలమానవజాతిసంతతులు కుల
వర్ణ భేదంబుల బాటింపబోక
యొక్క కడుపున బుట్టి యొక చన్నుబాలు
త్రావినరీతి, సౌందర్యంబు గలిగి
యన్యోన్యసాహాయ్య మర్థించువారు!

స్ఫటికపాత్రంబున శాంత్యాసవంబు
ధర్మదేవత తెచ్చి తనిపె నందఱిని
ఏక కుటుంబమై యీ ప్రపంచంబు
స్వర్గంబు భూమిపై స్థాపింపబడియె!

అభ్యుదయాంశువు లన్ని మూలలను
నవనవోజ్జ్వలజీవనంపు దీపముల
వెలిగించుచుండె; నీ విశ్వమంతయును
మానవకల్యాణమందిరం బయ్యె!

అంతలో లౌకిక యాదార్థ్యములను
భావంబు వ్రాలెను బక్షివిధాన,

బొగ్గు కంబములట్లు పొడకట్టుచుండె
దఁత్ప్రాంతములనున్న తాళవృక్షములు,
చిమ్మచీకటి నోంటి జిక్కుకొనియుంటె!

రామిరెడ్డి

## ప్రాత

ఆగు మాగుము తెరువరీ, ఆ
యాసఖేదము నపనయింపుము
మా గృహాంగణకుసుమసముదయ
మధువు లియ్యవిగో!

నీరజాప్త నిశాతకిరణో
న్మీలితములై పరిమళించెడు
వారిరుహముల గుమ్మరిలిన తు
షార మియ్యదియే!

మావిపూగుచ్ఛముల నసకృ
న్మత్త మధుపచయమ్ము లాడగ
బ్రోవుపడిన పరాగమ్ముదుల వి
భూతి యియ్యదిగో!

తూరుపున సింధూరరాగము
దొలుక, తొయ్యలు లేరి తెచ్చిన
పారిజాత ప్రసవమాలా
బహుళ మియ్యదియే!

ఆగు, మాగుము తెరువరీ, ఆ
యాసఖేదము నపనయింపుము,
మా గృహాంగణ కుసుమసముదయ
మధువు లియ్యవిగో!

వెంకటసుబ్బయ్య

# సాధుగీతి

లితాంతాగ్ర్రరాగమ్ములన్ బాడు తేటుల్
వసంతమ్ము కాంతి ప్రవాహమ్ము లందున్
నిసర్గాప్త శోభావినీతిం బ్రియమ్మై
కనుల్గట్టు చందాన గాన్పించు పూవుల్
కనుంగొన్నచో, వేడికన్నీళ్ళు రాలున్,

అలంకారము ల్లేని యాపూల ముగ్ధో
క్తులన్ లీనమైపోయెదో, సాధుగీతి!

కవిప్రేమ పుష్పింపగా జేయు కృష్ణా
స్రవంతీ తరంగాంతరంగమ్ము జూడన్
హతస్వాంతయై, దీనయై, తీరభూమిన్
వెతల్విప్పి వాపోవవీక్షించు, కన్యా
మణీశోకమూర్తి శ్రమల్గన్న రాగా
రుణమ్మైన చింతాశ్రుఝరుల్ వాలు నాత్మన్,

అలంకారముల్లేని ఆ కన్నె శీతా
ర్తులన్ లీనమైపోయెదో సాధుగీతీ!

**అబ్బూరి**

# ఎవరు?

ఎవరోహో, ఈ నిశీథినెగసి, నీడవోలె నిలిచి,
పిలుతు రెవరో, మూగకనులు మోయలేని చూపులతో!
ఎవరోహో! ఎవరోహో!

ఇపుడా నను బలుకరింతురు!
మ్రోయలేని నీరవగళమున చలించు కోరికతో
ఇపుడా నను బలుకరింతురు!
ఎవరది ఈ రేయి నిదురు హృదయ మదర, వేయి చేయి
చాయలాడ పెనుచీకటి సైగలతో నా కన్నుల
రకమురల లాగికొందురు!

ఎవరో నా హృదయ నాళ
మేలా తునియలుగా, నా
నిర్జీవపు జీవితమ్ము నిటువదలుదురా!

ఎవరోహో!
ఎవరోహో!

ఇపుడా నను పలుకరింతురు?

కృష్ణశాస్త్రి

## పెన్నిధి*

ప్రేమ పెన్నిధి,
కాని యింటను
నేర్పరీ కళ
ఒజ్జ లెవ్వరు
లేరు;
శాస్త్రము లిందు గూరిచి
తాల్చె మౌనము,
నేను నేర్చితి
భాగ్యవశమున కవుల కృపగని;
హృదయ మెల్లను నించినాడను
ప్రేమ యను రతనాల -

కొమ్మ!

తొడవులుగ నవి మేన దాల్చుట
యెటుల నంటివొ?

తాల్చితదె, నా

కంట చూడుము!
సతుల సౌరను
కమలవనముకు పతులప్రేమయె
వేవెలుగు
ప్రేమ కలుగక బ్రతుకు
చీకటి!

గురజాడ

* ''కాసులు''లోని ఒక భాగం ''పెన్నిధి''

# అద్వైతం

ఆనందం ఆర్ణవమైతే
అనురాగం అంబరమైతే
అనురాగపు టంచులు చూస్తాం
ఆనందపు లోతులు తీస్తాం!

నీ కంకణ నిక్వాణంలో
నా జీవన నిర్వాణంలో
నీ మదిలో డోలలు తూగీ
నా హృదిలో జ్వాలలు రేగీ
నీ తలపున రేకులు పూస్తే
నా వలపున బాకులు దూస్తే

మరణానికి ప్రాణం పోస్తాం!
స్వర్గానికి నిచ్చెన వేస్తాం!

హసనానికి రాణివి నీవై
వ్యసనానికి బానిస నేనై
విషమించిన మదీయ ఖేదం
కుసుమించిన త్వదీయ మోదం
విషవాయువులై ప్రసరిస్తే
విరితేనియలై ప్రవహిస్తే

ప్రపంచమును పరిహసిస్తాం!
భవిష్యమును పరిపాలిస్తాం!

వాసంతసమీరం నీవై
హేమంత తుషారం నేనై
నీ ఎగిరిన జీవవిహంగం
నా పగిలిన మరణ మృదంగం
చిగురించిన తోటలలోనో
చితులుంచిన చోటులలోనో
వలయములై చలించినపుడే
విలయములై జ్వలించినపుడే

కాలానికి కళ్ళెం వేస్తాం!
ప్రేమానికి గొళ్ళెం తీస్తాం!

నీ మోవికి కావిని నేనై
నా భావికి దేవివి నీవై
నీ కంకణ నిక్వాణంలో
నా జీవన నిర్వాణంలో
ఆనందం ఆర్ణవమైతే
అనురాగం అంబరమైతే

ప్రపంచమును పరిహాసిస్తాం!
భవిష్యమును పరిపాలిస్తాం!

శ్రీ శ్రీ

(ఎ.సి. స్విన్‌బర్న్ తన రచనలలో, ముఖ్యంగా 'ఎ మేచ్' అనే గీతంలో చూపిన మార్గానికి కృతజ్ఞతతో.)

## ప్రేమతత్త్వము

ఎదమెత్త నౌటకై
సొదగుందరా అంత
మదిగల అహమ్మంత
వదలి పోవునురా!

వలపెరుంగక బ్రతికి
కులికి మురిసేకన్న
వలచి విఫలమ్మైంది
విలపింప మేలురా!

చెలి వలపు లేని నీ
కలిమి కాల్పనె వినుము
వలపు తీగనె జీవ
ఫలము కాయునురా!

ప్రేమ కన్నను ఎక్కు
వేముందిరా, ఎల్ల

కామ్య పదవుల
ప్రేమె ఎక్కువరా!

ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై!
ప్రేమించు ప్రేమకై
ఏమింక వలయురా!

ఎద మెత్త నౌటకై
సొదగుందరా, అంత
మదిగల అహమ్మెల్ల
వదలి పోవునురా!

బసవరాజు

## ప్రేమకొఱకు

చెట్టునకు మొగ్గ దొడిగెడు చేష్ట గలదు
కోరకమునకు వికసించు గుణము గలదు
విరికి వలపుల వెదజల్లు విద్యగలదు
దేనికొఱ కిదియంతయు దేనికొఱకు?
ప్రేమకొఱకు ప్రేమకొఱకు ప్రేమకొఱకు!

కోకిలం బూరకయ పాడుకొనుచునుండె
స్వరలహరిలోన నమృతంబు గురియుచుండె
నమృతరసమెంతొ మాధుర్య మగుచునుండె
నెందుకొఱ కిదియంతయు నెందుకొఱకు?
ప్రేమకొఱకు ప్రేమకొఱకు ప్రేమకొఱకు!

హృదయపదమున నెల యుదయించుటేమి?
కలశవారాశి మిన్నంటి తొలకుటేమి?
మెఱపు దీగలు మిలమిల మెఱయుటేమి?
దేనికొఱ కిదియంతయు దేనికొఱకు?
ప్రేమకొఱకు ప్రేమకొఱకు ప్రేమకొఱకు!

ఇనకరంబులలో వేడి యెందుకొఱకు?
ఇందుకిరణంబులను జల్వ యెందుకొఱకు?

బుక్షసంతానమున మిన్కు లెందుకొఱకు?
ప్రేమకొఱకు బ్రేమకొఱకు బ్రేమకొఱకు!

ఎఱుగబడకున్న యీ కూర్పు లెందుకొఱకు?
తెలియబడకున్న యీ మార్పు లెందుకొఱకు?
విశదపడకున్న యీ నుడు ల్వేనికొఱకు?
ప్రేమకొఱకు బ్రేమకొఱకు బ్రేమకొఱకు!

ఈ సుఖంబును గష్టంబు నెందుకొఱకు?
ఈ భవంబును నాశంబు నెందుకొఱకు?
ఈ జగంబున నిన్నియు నెందుకొఱకు?
ప్రేమకొఱకు బ్రేమకొఱకు బ్రేమకొఱకు!

**వేంకట పార్వతీశం**

# సన్యాసి

మొగలిరేకుల మృదుల కపోలయుగము
కరకు టెండల వేడిమి కందువారె
తెలిమొగిలుచాటు నెలవంక తెరగు బూని
బూది బూసిన నీ మోము మురుపు కరిగె,

కన్నె పూబోణి గాటంపు గౌగిలింత
నవసి వసివాడు నీ మేనిచివురు నేడు
కఠిన హృదయమ్ములేనియు గరగిపోవ
కటిక రానేల గదుములు కట్టెనకట!

కావిపుట్టము కటిసీమ కట్టుభాగ్య
భోగ్యరాహిత్యమైన వైరాగ్యమునకు
జాజిపూసౌరభమ్ములు జల్లు విరియు
జవ్వనమున కెంతటి దవ్వు గలదు?

దివ్యకుసుమాంగి యీనెలు దీసి యిచ్చు
లే దములపాకుమడుపులు కాదటంచు
హరిణశాబమ్ములకు తృణాంకురము లిడగ
మనసుపుట్టెనె ఎంత యమాయికుడవు?

మధుర దరహాస చంద్రికా సుధ తొరంగు
కామినీ స్నిగ్ధ గండ భాగమ్ములాను
కప్పురపు కమ్మతావుల కావిమోవి
బీటువడ నీకు వైరాగ్యవృత్తి యేల?

అల్లనల్లన దరిజేరి అలతి సిగ్గు
జాలిచూపుల క్రేగంట మేళవించి
మధుర మందస్వనంబుల మాటలాడు
ప్రణయినీ బాంధవం బెట్లు బాసినావు?

సర్వము పరిత్యజింపగ జనుమ గాక
పూపజవరాలి పొలయల్క బాపు నాటి
ప్రణయభావమ్ము స్మరణకు రాక గడవ
జనునె నీకు దీర్ఘ నిశీథ సమయములను?

నవ్వెద వదేల? నా మాట నమ్మి నీదు
నెలత కడకేగి, తప్పు మన్నింపు మనుము
కరకు రుద్రాక్షమాలల కంఠసీమ
కమ్మసంపంగి దండలు గౌగిలింప!

కొడాలి

## రంభ

(మాట్లాడకుండా వూరుకున్న శుకుణ్ణి
రెచ్చగొడదా మనుకొంది)

కోమల మందహాస వినిగూహన
చారు కపోలకామినీచ్ఛామతి
లోకమంతటను సర్వుడు కాని యొకం
డ పేతవాంఛామతి దన్ దలచు కొనసాగి
సదా అనుభూతిలోభియై యేమి గడించు?
లోక మెలయించిన నేమిఫలంబయా ఋషీ!

దేహమనంగ కోర్కెలు జితించినగాదు
నిరాశయన్ భ్రమోత్సాహములో నెఱుంగకయు
దాగిన రోగముగా దపోబహుద్రీహిభుజిక్రియన్
తిరుగబెట్టును పెట్టునయే న్మహౌషధుల్
దోహదముల్ వ్యపేతధృతితో బనిసేయవయా తపస్వికా!

భావము తేల చంపుటకు పాల్పడె
దీ ప్రతిచంపు వెంట హత్యావధి చేరుచున్నదికదా మరి
మీరలు మౌనులై యహింసావిధియాత్రులుంగద
ప్రశస్తులు వర్ణి! త్వదీయమౌ తపస్స్వవధిలో
లయాంతశిఖి చిట్టెము కట్టెడు లోకముల్ మునీ!

మౌనిశలాక! మెన్కనొకమారు తృతీయుడు
తాతతాతతో పూనినవైరి గాధిజుని
మొగ్గలకన్నులు మొగ్గలట్లు మా మేనక సిగ్గులన్
చిలికి మీగడచూపులు చూరలాడె మీ మౌనుల
రెప్పక్రింద కనుమాయల గోప్యము లేదు మాయెడన్!

తను వొకచోటనుండియు సదాగతియుక్తుడ
వంతరాన లోచనములు మూసియున్ నిఖిలసాక్షిని
పల్కకయున్ సమస్తభావనిలయబుద్ధి
వీ నియమభావనలో సహజస్వయంప్రతారణ
మొనగూడియున్నయదిరా యతిలోక శిరోమణి ఘృణీ!

ఒకరు డరుంధతీసతి వయోవిభవం బఖిలంబు
చూరపుచ్చుకయ పతివ్రతాగ్రసరచండిమ
గుత్తగొనెన్, మరొక్కడోడకు తెరచాపనీడలకడన్
బెదరెన్ చలిగాలివెచ్చ తావక పితరుల్
మునీ మెఱుగువచ్చినరాతిని నీవు వారిలో!

మసలకయుందు వేమి? యొకమారు కదల్చుము
లోనియూహ మేల్మసకపుపాముగా మలకలై
దుసికింతలు వోవ చూడు మానసమును దాటి
యాత్మ యనివారటె! అస్రమయిామనస్సు మాగినలన
కల్గునా? తెలివికిన్ తలదాటినదా కృతవర్త్రా!

లొంగనియట్లె ఆ పలుకులోపలి చక్కెరపాలు
గ్రుక్కిలుల్ మ్రింగెదువో బెడంగు కనురెప్పల
సంపెగ పచ్చి రేకు లాలింగనమున్ పొనర్చుకొను
లే కనుదమ్ముల తేటికూటమిన్ పొంగిన తేనెలో
నాలికిపోయిన యీ వలపంటునో మునీ!

(తూర్పులో తెల్లరేకలు తోచినై; ప్రక్కని రావిచెట్టు
ఆకుల్లో ప్రాతర్మందానిలాలు కిలకిలా నవ్వినై.)

విశ్వనాథ

# జొన్నచేను

‘‘కంకివెడలిన యా లేతకారుజొన్న
చేనిపై పిట్టలం దోలు చిన్నవాడ,
దారి బోయెడువారల బారజూచి
విసరుమా సుంత వడిసెల

వెనుక నదిగొ

కంకి తినుచున్న యది గోరువంక ఇంత
యాలసించిన నిలుచునా? చాలదూర
మెగిరిపోయిన దప్పుడే

దిగకు మంచె,
బెద్దలను నీకు నే దెచ్చి పెట్టుచుంటి;
ఒత్తుగా బట్టె గడ్డి మీ గిత్తల కిది
మేసరా యేమి? మా యావు తేపుమాపు
మొన్న మొన్నటిదనుక దా నన్ని యన్ని
పాల నిచ్చెడి దైదు దినాలనుండి
దూడకే చాలకున్న

వీయేడు గడ్డి

బొత్తుగా పట్టలేదు మా పొలముగట్ల...
నాల్గు గుప్పెళ్ల చాలును నాకు

బిట్ట

వ్రాలినట్లుండె మా తోటపైన సుంత
తోలుమా?

నాల్గు గుప్పెళ్ల చాలు నాకు

ఆనమై నొక తట్టెడుకోసిమాత్ర
మేమిసేయుదు

బిట్ట పోయినద లేద?’’

‘‘సెనగ పూరైక దొడిగిన చిన్నదాన
చిలుకయొక్కటి వ్రాలె నా మలుపునందు

నెంతతోలిన పోవ దే నేమి సేతు?
మిరప లీయేడు మీకు సమృద్ధి వంగ
చెట్లు లిప్పుడిప్పుడె పూత పట్టుచుండె;
బంతిపూవులు ముగ్గుల పండువునకు
నక్కరకువచ్చు; నియ్యెడ నొక్కమిరప
పండుచున్నది....గోయక వదల దీని
దోలుచుంటిని నే బిట్ట వ్రాలకుండ.
గోసికొను మింక గుప్పెడు....దోసతీవ
లున్న వాదరిగా, గాయలున్నవేమొ
చూడుమీ!....

నాల్గుకట్టల నూడబెఱికి
కంకులను గొట్టుచుందు నా కంచె కేగి
పచ్చజొన్నలు తీయని పాలుగారు
లేత గింజలు నినుము కాలిచిన నింత
తీపి యుండదు;

తట్ట నెత్తెదవదేల
నూగు పోవ నూదెడిదన్కనాగలేవె?''

''అప్పుడే యింటిదారి మాయావు పట్టె
గుడితివేళ యైనది యిటఁ గూరుచున్న
నెట్లు?

లీ కంకె ముదిరిన దేల విఱచి
తెచ్చితివి?

చాలు నా కివి తినుచుఁబోదు!''

''ఏను వచ్చెద తొందరయేల? నీకు
దోసపం డొక్కటియు గూడ దొరకలేదె?
యీ దరింగలవే గోసి యిత్తు రమ్ము!
కట్టలిట నొత్తుగా నుండె గాన నీకు
దొరకలే దదే మా మంచెదరిని గలవు
కోసియుంచితి రమ్ము నీ కొఱకు నేను!

ఆవు నాలుగుబారలే నరుగలేదు,
తీసికొని యేగెదవుగాని దోసపండు
కోసియుంచితి రమ్ము నీకొఱకు నేను,
సెనగపూరైక దొడిగిన చిన్నదాన!''

**పింగళి-కాటూరి**

# పూలబాసలు

పూలబాసలు తెలుసు యెంకికీ
తోట
పూలమనసులు తెలుసు యెంకికీ!
పూలమొక్కల నీటి
జాలు గని నిలుసుండి,
పూ లన్ని నీపాటె
ఆలించె నంటాది,
పూలబాసలు తెలుసు యెంకికీ
తోట
పూలమనసులు తెలుసు యెంకికీ!
పూలంటు కాలంటి
పున్నె ముం దంటాది,
వగలమారీ పడుసు
నగ దొడిగె నంటాది,
పూలబాసలు తెలుసు యెంకికీ
తోట
పూలమనసులు తెలుసు యెంకికీ!
తలెత్తి పూపడవ
పరిగెత్తుతావుంటె
దారెంట పూలొంగి
దణ్ణమిడె నంటాది
పూలబాసలు తెలుసు యెంకికీ
తోట
పూలమనసులు తెలుసు యెంకికీ!
పూలతో వియ్యాలు
పూలల్లో కయ్యాలు
మానల్లె నన్నుంచి
తానె పూ వౌనేమొ;
పూలబాసలు తెలుసు యెంకికీ
తోట
పూలమనసులు తెలుసు యెంకికీ!

నండూరి

# పిలుపు

రావోయి సిన్నవాడా!
మావాడ
రావోయి సిన్నవాడా!
పోటూపాటుల ఏరు
పొంగీ పార్లే సోట
రావోయి సిన్నవాడా!
మావాడ
రావోయి సిన్నవాడా!

ఎన్నెల ఎలుగుల్లోన
ఏటి నురగల్లోన
తెల్లని తెరసా పెత్తి
తీయని గొంతు కెత్తి
రావోయి సిన్నవాడ!
మావాడ
రావోయి సిన్నవాడా!

వాలూ మాపుల మాస్తు
కోలేస్తు నేవుంటె
ఎండే తలుకుల సేప
ఏటిలో వల వేతుగాని
రావోయి సిన్నవాడా!
మావాడ
రావోయి సిన్నవాడా!

ఉబికే వాగుల్లోకి
ఉయ్యేల లూగుతు పోయి
సందరాన పుట్టేటి
సెందురూని సేరుకొందం
రావోయి సిన్నవాడా!
మావాడ
రావోయి సిన్నవాడా!

బాపిరాజు

# కాపుపాట

ప్రేయసి! లేచిరమ్ము చివురించిన మావులక్రింద
శీతల చ్ఛాయలలోన యౌవన వసంత
శుభోదయ మయ్యె నవ్వుచున్ చేయికి జేయి జేర్చి
పెరచింతనలన్ మరపించురాగముల్ దీయుచు
వాసన ల్పరిమళించెడు చోటులయందు బోవగన్!

వ్రాలిన సంజల న్మరలివచ్చెడు గోవుల
బాలు తీయగా దోలెడుదాక త్రాడులును దుత్తలు
నావల బెట్టి సిగ్గులన్ సోలెడు చిన్నదాన
యెటు చూచిన నెవ్వరు లేనిచోట నుయ్యాలల
నెక్కి యూగ మనసయ్యెడు నీవును నేను వేడుకన్!

పాడుట కొప్పవేని పడవల్నడిపించెడు
నేటి త్రోవలే చూడగవద్దు లేతమనసుల్
తడిసేసెడు చెట్లచాటునన్ గూడిన మేనులానుకొన
కొమ్మల నాకులవోలె నొక్క మాటాడక
కూరుచుండ మనువైన పొలమ్ముల గట్టు నీడలన్

**అబ్బూరి**

# సింగారము

ఒక పువ్వు
నీ సిగకు
నగయై సు
మించినది–

ఒక పులక
నా యెదకు
నగయై భ్ర
మించినది!

ఒక తలుకు
నీ చెక్కు

లకు శోభ
కూర్చినది-
ఒక ములుకు
నా గుండె
లకు సోకి
ఏర్చినది!
ఒక పలుకు
నీ పెదవు
లకు వెనక
దాగినది-
ఒక ఆస
నా బ్రదుకు
సుక మాహ
రించినది!

విశ్వేశ్వరరావు

## ఓయీ!

నిన్నె కోరుదు నోయి! యితరుల
నెన్న డెరుగనిదాన నోయీ!
నాడు నే డేనాటికిని నీ
దాననే నోయీ!

మనసు నా కేకాంత మోయీ!
బ్రతుకు నాకు ప్రశాంత మోయీ!
అంద మాముదదీప మోయీ!
వలపు నేనోయీ!

సొగసు పువ్వులు సోలు ముద్దులు
వలపుపన్నీరుల తుషారము
వెలుగుతేటల పసిడిపువ్వులు
కాన్క నీ కోయీ!

రామచంద్ర అప్పారావు

# ప్రియుడా

వచ్చి లాలించేటి ప్రియుడా!
నన్ను మచ్చికల నలరించు ప్రియుడా!
హెచ్చయిన ప్రేమసుధ లిచ్చి
[1]నన్ను వగల మరపించేటి ప్రియుడా!
భవ మెంతొ భారమై[2] పరుగులెత్తేవేళ

శీర్ణమై నా గుండె శిథిలమయ్యేవేళ
కన్నుగవలో నొక్క కాంతిపుంజము దాల్చి
[3]విన్ననవ్వులు మోముపై చిందులాడగా
ప్రేమతో మనసిచ్చి [4]ప్రీతితో నను దేర్చి
రమ్యమధురాలాప రసము నాపై చిల్కి
నడకలో నొకవింత నాట్యమాడుచునుండ
పలుకులో నొకతీపి పలుకరించుచునుండ
ఇరులు నీ నవ్వుతో విరిసిపోవగజేసి,
మాటిమాటికి [5]నాలొ మమత పెంపొందించి

వచ్చి లాలించేటి ప్రియుడా!
నన్ను మచ్చికల నలరించు ప్రియుడా!
హెచ్చయిన ప్రేమసుధ లిచ్చి
నన్ను వగల మరపించేటి ప్రియుడా!

**విశ్వసుందరమ్మ**

1. నన్ను తనియించి వగల....
2. బాధ నొందెడి వేళ
3. చిరునవ్వు మోముపై చెలగ నా దరిజేర
4. ప్రియ వచనముల దేర్చి
5. మదిని మమత లూరగ జేసి

# ఒకరికొకరు

నువ్వు నేనూ కలిసి
పువ్వులో తావిలా
తావిలో తలపులా!

నువ్వు నేనూ కలిసి
కోకిలా గొంతులా
గొంతులో కోర్కెలా!

నువ్వు నేనూ కలిసి
వెన్నెలా వెన్నలా
వెన్నలో వెలుగులా!

నువ్వు నేనూ కలిసి
నింగిలో నీడలా
నీడలో నిదరలా!

బాపిరాజు

# అడవి పిల్ల

నిండుప్రాయమ్మునకు తోడునీడయ్యైన
సిగ్గు సింగార మెరుగని చెలియ నీదు
ముగుదమూపులు మా పూర్వపుణ్యమునను
అడవి తొలకరి పూవులయట్లు దొరికె!

ముళ్ళ పూదీవ గుంపుల చాళ్ళ నుండి
కన్నెగాడుపు పీచిన కదలు నీదు
మెన్నెల యిగుళ్ళ పయ్యెద వెలితి నుండి
జవ్వనపు నీడలారిన చాలు మాకు!

సడియు చప్పుడు లేని యీ యడవికోన
అలతి సెలయేటి సొనల యీలలకు లయలు
తెలియజెప్పు నీ రాగాల తీయదనము
వలన పూలకారుపవళ్ళు పులకరించు!

ఈ మలయపవనమ్ములు ఈ మనోజ్ఞ
యామినులు నీ వనుభవింప నా విరించి
తెరవ నీ కొక్కెతకు ప్రసాదించెనేమొ
వలపువలవంతలెరుగని పడుచుదనము!

వింటిబద్ధల అంబులు విడుచు నీదు
సులువునేర్పులలోని నాజూకుదనము
అలరువిలుకాని కేనియు దెలియరామి
బ్రదికిపోయిరి తబసి జవ్వనులు నిజము!

కొడాలి

# కోకిల

ఈ మావిపై నుండి
ఈవు కూ కూ యంచు
ఆ మావిపై నుండి
ఆపె కూ కూ యంచు

ఏమిబాసల జేతురే
కోకిలా! ఏమిబాసల జేతురే?

ప్రకృతి జన్యంబులై
పరమరమ్యంబులౌ
భావముల నొండొరుల
ప్రణయ మొల్కెడునట్లు

పల్కరించుచునుంటిరే
కోయిలా! పల్కరించుచునుంటిరే?

మనుజుల కగమ్యమై
మహితశక్తిం గల్గి
పరమామృతము లొల్కు
ప్రణయవాక్కుల మీరు

బాస లాడుచు నుంటిరే
కోకిలా! బాస లాడుచు నుంటిరే

పరులు విన్నను మీదు
పరువు పోవు నటంచు
పాడులోకము జూచి
భయమె లేకను వలపు

పలుకు లాడగ జెల్లనే
కోకిలా! పలుకు లాడగ జెల్లనే?

పరమప్రేమస్వరూ
పంబులై లోకాల
పావనంబుల జేయు
ప్రణయకవులౌ మీకు

పరులనేవా రుందురే
కోకిలా! పరులనేవా రుందురే!

చెలియయును నీవలెనె
చివురుటాకుల మెక్కి
చెవులపండువు గాగ.
చిలుకంగ గానమ్ము

చింత నీకేమున్నదే
కోకిలా! చింత నీకేమున్నదే?

చెంతగూర్చుని మోము
చెలువు గుల్కగ వలపు
దెలుపుచుం బలుకంగ
చెలి చెంతలేని నా

చింత లెన్నడు తీరునే
కోకిలా! చింత లెన్నడు తీరునే?

పాడవే కోకిలా?
పాడవే యింపుగా!
ప్రాణముల్ హాయిచే
పరవశ మ్మొందగా!

పాట పాడవె తీయగా
కోకిలా! పాట పాడవె తీయగా!

బసవరాజు

# పరిచిత కంఠము

ఆకసమున నవిగో చుక్క
లల్లుకొనెడు చందమామ
వృక్షమ్ముల సందునుండి
తొంగి తొంగి చూచుచుండె!
కొండలోయ దిగెడు వాగు
నుండి జీవజలము లవిగో
నురగ గ్రక్కు నలలతోడ
గుసగుస లాడుచు పోయెడు
పండువెన్నెలన్ మెయి పర
వశ మొందగ కోకిలంపు
పాటకు చెవియొగ్గి పూల
వాసనకున్ మదిని పొంగి
కూరుచుంటి సుఖముగ నీ
కొండరాతిపైన నౌర!
'యేమి టిద్ది సఖీ' యనుచు
యెవరో నన్ను పిలిచినట్లు
అమృత మధురనాదముతో
నాత్మ కట్టుకట్టి లాగు
ఈ కంఠము మున్నెపుడో
విన్నయటులున్న దహో!

సౌదామిని

# స్నేహరుచి

అరమరలేని మన చిరతర స్నేహరుచుల్
'కురిసిన వెన్నెలలా, అరవిరిసిన మల్లియలా!
మనమున నెవ్వగలే మాసెను,
ఘనమగు నెయ్యములో

మెరవుల గుంపేమో అది
తరగని వెలుగేమో!
దినములు నిముసములై[2] చనియెను
తిన్నని నడకలతో
కన్నులతళుకేమో, అది
పున్నెపు ప్రోవేమో!
[3]జీవితమున కంతా అది
చెలువపు నిగ్గేమో!
పరమప్రేమకు చిహ్నమైన తెలి
వెన్నెలకాంతుల
సన్నపు తళుకేమో!

**విశ్వసుందరమ్మ**

1. విరిసిన 2. నడిచెను 3. బ్రతుకునకంతకును అది ప్రణయపు నిగ్గేమో, పరమ ప్రేమకు చిహ్నమ్మగునా పున్నమి చంద్రుని వెన్నెలతళ్కే!

## ఓ సఖీ!

పదునాల్గుభువనాలు పరిసుప్తి నుండంగ
మనము మేల్కొనియుంట మఱచిపోతె?
నీ కంటికొలికి నొక నీటిబిందువు నిల్చి
ఖేదమో మోదమో
భేదపరుపరాని నిశ్చలశోభ
మాననీయంబయ్యె

తక్కుగలవారి కంధంపురాత్రి
మనపట్టుమాత్ర మపుడనుకొని పట్టపగలనిపించె
దాని నీ కపుడె తెలుప నాత్మ నెంచితి
కాని యశ్రుకణము ముందు దుడిచి
వెనుక ముచ్చటింపగబోతి
నీవు మందస్మితస్విన్నవైతి
కనులు మెఱసెను
కప్పె గాఢాంధకార మెద
ఓ సుముఖీ! ఓ సఖీ!

**కవికొండల**

# శుక్రవారము

ప్రేమమధుపూర్ణమైన నా హృదయపాత్ర
నీ దినము నీ పెదవుల కందింతు నవెడు
నాసలో గన్నువిచ్చితి, నమృత సరసి
బ్రాతరున్మిషితమ్మైన పద్మమట్లు
ఆ త్రిలోకైక జననిపాదాబ్జసవిధ
భూమి, మీలితనేత్రవై మోకరిల్లి
నీవు పూజాసుమమ్మ వైనావు
హృదయ
కర్ణికామూలమున భక్తి కందళించి
అదరు పారవశ్యమ్మున తొడిమ యూడి
నేను పూవునై పడితిని నీదు చెంత;
జంటపూవుల యమృత నిశ్వాస సౌర
భముల రోదసి శుక్రవారము ధ్వనించె.

నాయని

# అపుడు

అపుడు నిల్చితివోయి నా ప్రియు
రాలి శాంతమనోజ్ఞరూపము
తనివిదీరగ జూచు తలపున
స్తంభనవిధమునన్

ఆహహా వికసనమొందె వోయీ
అపుడు నా కనుదోయి లక్ష్మి
తిలక పాటల ఫాలమండల
దీప్తి జాలమునన్!

నాట్యమాడిన దోయి మామక
నయనయుగళం బపుడు లక్ష్మి
కర్ణపూరోద్దీప్తమంజుల
గండభాగమునన్!

చిరము నేత్రద్వయి విహారము
చేయసాగిన దోయి లక్ష్మి
కలితకాంచనహారవిలస
త్కంఠ దేశమునన్!

గాఢరాగోద్రిక్తమతినై
కన్నుగవతో ముద్దులాడితి
కటక కంకణ రుచిర లక్ష్మి
కర సరోజములన్!

ఏమి చెప్పుదు సఖుడ నా హృద
యేశ్వరీ మృదుపాదయుగళికి
సాటివచ్చునొ రావొ యించుక
స్థలజలేజములే!

తన్మయుండ్బై మామకాక్షి
ద్వయము బంగరుబొమ్మ తొడిగిన
పట్టురైకను విడువదాయెను
ప్రాణమిత్రంబా!

తెల్పనేరగదోయి లక్ష్మి
దేవి లోచనరోచి పల్కుల
కేవలం బా నేత్రయుగళికి
క్రీతదాసుండన్!

శివశంకరశాస్త్రి

## గాయనీప్రియ

నా ప్రథమదృష్టి నీ సువర్ణాంగ జలజ
మరవిరిసి తేలె నీ గానమందు బాల!
ఆ మధురమూర్తి సంస్మృతులందె కోర్కి
పూచి వాసించి నేడును వేచియుంటి!

నీ మధురగాన మానాడు నెమ్మివోలె
పురి నెగయబోసి మిలమిల మెరసిపోవ
విపుల నేత్రాల నీ ముగ్ధ వీక్షణమ్ము
లటు నిటుల సిగ్గులో నడయాడినాయి!

నీ యొడిని ముద్దువీణియ నిలిపి మీట
నంగుళీ చంచల కిసలయమ్ము లరుణ
రాగముల వీణగళమ్ము జేగురించె
కోకిలల పాటలే దాన రేకులెత్తె!

చిన్ని చిని సిగ్గుచివురులు పన్ని నేడు
తన యొడిని దాచుకొనియె యౌవనము నిన్ను
ముసి ముసి యమాయకత్వమ్ము మూగవోయి
పలుక జాలదొ పెదవులు వెలికి బారి!

విశ్వేశ్వరరావు

# స్నేహబంధము

ముసుగు తీయక లోకంపు గుసగుసలకు
శిరసు వాల్చక వలిగాలి తెరలలోన
మొలకనవ్వుతో కలలతో వలపు బరువు
తావి పిలుపుతో నిత్యమ్ము స్వాగతమ్ము
లాలపించెడి లేత గులాబికన్నె!

నాకొరకె వేచి వరియించి నన్ను ఆమె
ముద్దులిచ్చును చుక్కలమోవికాంతి
దారిలో కౌగలించును తలుపుశాంతి
తరలు నిశ్శబ్దరేఖలో తాండవించు
నన్ను కూడి నా నీడ వెన్నాడుకొనుచు!

కంటనీర్వెట్టు మోదాశ్రుకణము లనున
వంతకే చోటులేదను సృష్టిమాపు
కౌగిలింత సోలింతలో కన్నుమోడ్చు!
క్రూర హేమంత శర్వరీ కుంతలముల
లోల మధుమాస చంద్రికా లోచనముల
కురియు ముద్దిదే యను కన్ను లరగమోడ్చు
మరచి మరపించి జాలిలో మమతలో వి
లాస సుస్థాయి నెదపువ్వు వ్రాల్చివ్రేయు
నా గులాబి! నెదపువ్వుకొమ్మ!

రామచంద్ర అప్పారావు

# ప్రణయ శాంతి

రాలి పడియున్న దానిమ్మ పూలతేకు
లొలయు చోటుల సాంధ్య వాయువులలోన
కనబడని భావముల సువాసనల కొఱకు
వినయమున బాల్యదృష్టి నిల్పితి నొకింత
ప్రణయవతి! ప్రేమమునకు సారమ్ము లేదు!

నీవు పాడిన కృష్ణవేణీ స్తవమ్ము
హృదయ పదమున నొక సెలయేటి వోలె
చల్లనగు తుంపురులు వెదజల్లు వేళ
పలుకరాని గీతిక కలకల మొనర్చు
ప్రణయవతి; ప్రేమ శాంతికే భంగమగునొ!

అబ్బూరి

# పిలుపు

కొండ తిరిగీ కోన తిరిగీ
చీరచెరగున కూరిచితిరా,
గరికెపూల కంఠమాల;
ఆవు నడిగీ అడివి నడిచీ
పూలగిన్నెల పొందుపరిచితి
గుమ్మపాలు కొమ్మతేనె;
చాయవెన్నెలా లోయబయలా
పచ్చికమెత్తల పానుపుపైనా
‘‘క్రో’’ ‘‘క్రో’’ యంచు ‘‘క్రో’’ యనరా;

నండూరి

బహుళమందారగంధలోభమున తిరుగు
మధుకరమువోలె హృదయ మున్మత్తమయ్యె,
పరవశమ్మైన భావప్రపంచమందు
బందినై యెన్ని నాళ్ళుండవలెనో యేమొ!

దీపికలు లేని వాకిళ్ళు తెఱచి నాదు
తలఁపు లొక్కొక్కటే నిన్ను [1]దరియబోయి
తిరిగి వచ్చుచుండు పందిళుల క్రింద
కేళిఁ దిరుగాడు పెండ్లిచుట్టాల రీతి!

అబ్బూరి

1. తెలియబోయి.

# మంగళాచరణము

ప్రొద్దుపొడుపు నోములు నోమఁ బూనినావొ
చిట్టిబొట్టు కుంకుమఁ బెట్టు చిన్నదాన
ధవళ కీర్తి దుకూల సుందరములైన
యాసలు విఱుందులంటు సోయగ మదేమొ.

శ్రవణ పాళికా జ్వర బంధురమ్ము లయిన
రణరణ న్మంజు మంజీర రభస మేల?
కడల నెల్ల నాకర్షించి కనులు గట్టు
తెనుగుమీరిన గరువంపుఁ దీరు లేల?

క్రాలుకనులఁ గాటుక నిగారంపుఁ బసల
మోహపెట్టుచునున్నావు ముగ్ధజనుల,
చిన్నతనపు సింగారంపుఁ జెయిది సిరుల
వలచి వలపించుచున్నావు పడుచువాంఛ్ర!

పరమ వాత్సల్య దృష్టులు మరులు గొలుపఁ
బ్రేమకవితాంధ్యులైరెల్ల పెద్దవారు,
ఏమిటికి నీ యుదయకేళి యిగురుబోడి!

గిలుకు బొడ్డాణ మింత బిగించితేల
కంఠమాలలు జీరాడఁ గట్టితేల,

ఆరి యారని యార్ద్రనీలాలకములు
మెడలఁ బొరలాడఁ బాయలు ముడవవేల?
నగవు పూదండ లెట్టి కాన్కలు కుమారి!

ఎచట కేగెదు, నోము పేరేమి చెపుమ?
ఎవ రధిష్ఠానదైవము, వృత్తమెద్ది,
సాంగ పూజావిధాన మేభంగి జరుగు,
తగు నుపాయనమేది, తత్ఫలము లెవ్వి?

సువ్రతోద్వాహ పరిపూర్ణ శుభము లేవొ
తీయని తెనుంగుమాటలఁ దెలుపగలవొ!
కన్నెవాదో తెనుఁగునాటి చిన్నదాన!

అభము శుభము నెఱుంగని యబలవయ్యు
నదరు బెదరు లే కీవ్రత మందికొంటి
నేర్పరివిఁ బోలె, కన్నెవు తీర్పఁగలవె,
సందియముమాన్ప రావమ్మ, చక్కనమ్మ!

రాయప్రోలు

# నాగులచవితి

నీ పుట్టదరికి నా పాప లొచ్చేరు,
పాపపుణ్యమ్ముల వాసనే లేని
బ్రహ్మస్వరూపులౌ పసికూనలోయి,
కోపించి బుస్సలు కొట్టబోకోయి!

నాగుల్లచవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

చీకటిలోన నీ శిరము తొక్కేము,
కసిదీర మమ్మల్ని కాటేయబోకు,
కోవపుట్టలోని కోడెనాగన్న
పగలు సాధించి మా ప్రాణాలు దీకు!

నాగుల్లచవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

అర్ధరాతిరివేళ అపరాత్రివేళ
[1]పాప మే మెఱుగని పసులు తిరిగేను,
ధరణికి[2] జీవనాధారాలు సుమ్మ!
వాటిని రోషాన కాటేయబోకు!

నాగుల్లచవితికి, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

అటుకొండ యిటుకొండ ఆ రెంటినడుమ
నాగుల్లకొండల్లో నాట్యమాడేటి
దివ్యసుందరనాగ, దేహి యన్నాము,
కనిపెట్టి మమ్మెపుడు కాపాడవోయి!

నాగుల్లచవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

పగలనక రేయనక పనిపాటులందు
మునిగి తేలేటి నా మోహాలబరిణె
కంచెలూ కంపలూ గడిచేటి వేళ
కంపచాటుననుండి కొంపదీకోయి!

నాగుల్లచవితికీ, నాగేంద్ర, నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

**బసవరాజు**

1. పాపమే యెఱుగని పసులు తిరిగేని
2. జీవనాధారమైనట్టి

# సంక్రాంతి

దినకరుఁడు శాంతుఁడై తోచె, దినము లింత
కుఱుచలయ్యెను, జలిగాలి చురుకు హెచ్చెఁ
బొలములన్ రేల గ్రుడ్డివెన్నెలలలోనఁ
గుప్పలన్ నూర్చు కాపులు గొంతులెత్తి
పదములన్ బాడఁదొడఁగిరి, పచ్చపూల
జనుపచేలకు ముత్యాల సరులు గూర్చి
మిరపపండ్లకుఁ గుంకుమ మెరుపుఁ దార్చి

బంతిపూవుల మొగము లల్లంత విచ్చి
మన గృహమ్ముల ధాన్యసంపదలు నిల్పి
సరసురాలైన పుష్యమాసమ్ము వచ్చె!

కోడితో మేలుకొని, తానమాఁడి, నుదుట
దిరుమణియుఁ దిరుచూర్ణముఁ దీర్చిదిద్ది
యొక్క కేలను దంబుఱ నొక్క కేలఁ
జిఱుతలం బూని, నున్నని శిరముపైని
తొలగకుండ నక్షయపాత్ర నిలిపి, మేలు
కొలుపులంబాడి, వీధివీధులను దిరిగి
యనుపదమ్మును "రంగరంగా" యటంచు
గడప గడపకు నేగి, భిక్షమ్ముఁ గొనుచు
జేరవచ్చెను సాతానిజియ్య రడుగొ!
మేలకొనుమమ్మ నా తల్లి మేలుకొనుము!

తల్లివేసిన ముగ్గు చెదరకమున్నె
గొబ్బిళులు చెల్లితోఁ బెట్టుకొందుగాని,
బంతిపూవులు, ముద్ద చేమంతిపూలు,
గోసి యొడి నింపుకొని తెచ్చుకొందుగాని!

తల్లిరో, దొడ్డిలోని సీతాఫలమ్ము
కోసి యిచ్చెద రమ్మ! కుంకుమము బసుపు
గొబ్బెమ కలంకరించి మ్రొక్కుదువుగాని,
నిన్ను దీవించు గొబ్బెమ్మ కన్నతల్లి!

అన్ని పండువులందు ముఖ్య మిది గాన
నత్తవారింటి కేగు మో క్రొత్తపెండ్లి
కొమరుఁడా! అందు నీకు నెక్కుడుసుఖమ్ము
ముద్దుమరదలు నీతోడ ముచ్చటాడు
వదిన నీతోడ మాటికి వరుసలాడు,
గఱువుదీరఁగ నినుఁ గాంచు తెరువు లేక
తలుపుచాటున నిలిచి నీ తరుణి నిన్ను
నోరచూపులఁ జూచి, యుబ్బితలూచు,
జిత్తమును; నిన్నుఁ జూచి, యా చిగురుబోఁడి
పట్టజాలని సంతోషభరముచేత
నింట మాటికి నటునిటు నేగుచుండి

ముగ్ధమోహన కల్యాణమూర్తితోడ
సమయమగునెడ నీకు సాక్షాత్కరించు!

అత్తవారింటి విందులటన్న భార్య
వాలుఁ జూపుకోపులె కాని, వారు పెట్టు
పంచభక్ష్యమ్ము లనుకొని భ్రాంతిపడకు,
ఊరివారలు నీ యెడ గారవమున
మన్ననలు సల్పుదురు, నీదు మామకూడ
నడుగులకు నీకు భృత్యుఁడై మడుఁగు లొత్తు
నత్తవారింటి కేగిరావయ్య నీవు!

★ ★ ★

రండు మాయింటి కీరు పేరంటమునకు
బొమ్మలెత్తుసు మా పిల్ల యమ్మలార!
ముద్ద చేమంతి పూవులు ముడిచినట్టి
జడలతోఁ గ్రొత్తపల్లెతో నడుగుఁలబడి
చిందులంద్రొక్కు పరికిణీ చెలువుతోడఁ
గాళ్ళఁబారాణి, కాటుక ఁగన్నుగవను
దిద్దికొని, మురిపెమ్మును ముద్దుఁదొలఁక
నగుమొగమ్ములతోడఁ గన్యకలు నీకు
నర్చ లొసగఁగ నిలిచి, రీ వరుగునపుడు
వచ్చిపోవమ్మ, మాయింటిపజ్జ కీవు,
పరమకల్యాణి, మా తల్లి పౌష్యలక్ష్మి!

**పింగళి-కాటూరి**

# పెండ్లికూతురు

కనుగవ దల్లిగారిడిన కాటుకరేకల
బ్రేమవల్లికల్, బెనచి, త్రపాప్రసూన
మధులేశములన్ మిళితంబులైన వీక్షణముల
ని న్నారుల్ గనని చందమునన్ వరుగాంచు నీకు,
యౌవన మధుమాస యామినులు ప్రాప్తము
లయ్యెడుగాక, శీఘ్రమే!

త్వాదృశబాలికల్, తలుపుదగ్గర
బొటలువాడు పెద్దముత్తైదులు, భర్త పే
రడిగినప్పుడు తీగయెలుంగు ముగ్ధతన్
బేద నడంగ, ''వంతు మన పెండ్లికుమారుని'' దన్న
నీదు లజ్జాదరహాసచంద్రికలు శాశ్వతమై
వెదజల్లుగావుతన్!

పగడపు మోవికెంపులకు బైపయి
దాగుడుమూతలాడు లేనగవు గులాబిపూ
సరమునన్ విరిమల్లెల దాపినట్లు దోపగ,
బతియుత్తరీయ మధుపర్కము గేల గ్రహించి,
వెంట జంటగ జను నమ్రభావము లనారతమున్
నిను బాయకుండుతన్!

పునుగు జవాది తావులు గుబుల్కొను
నీ పసుపుం బయంటకొంగున ముడివైచికొంటిగద
కోమలి, నీ మగ డింక నెట్లు చెప్పిన నటులే
వినంగలడు, పెండ్లము గీచినగీటు దాట
డంచును వదినల్ నగన్, జురుకుచూపుల
జూచెడు నీకు సౌఖ్యమౌ!

వేసంగి సందెల విరిమల్లె పూలు
పరచిన ముత్యాల పాలకిలోన
నూరేగునాటి నీ యుత్సాహ దివ్య
మధుర దృశ్యంబులు మరతుమే మేము,
చుక్కలరథములో నెక్కి వేంచేయు
ఒక చందమామ మా కున్నంతవరకు!

కొడాలి

# గంగిరెద్దు

ప్రభువుగారికీ దణ్ణం పెట్టూ
పాదం వంచీ భక్తిని పెట్టూ!
పట్టుశాలువలు కప్పేదరంటా
కాసులు మువ్వలు కట్టేదరంటా
డూ డూ డూ డూ యెంకన్నా!

మోసము చేసును మునసబుగారు
కక్షలు కట్టును కరణంగారు
కలిమి కలిగినా కాపులు పీరు
డూ డూ డూ డూ యెంకన్నా!

కుంచెడు మాయ కోమటి మాట
పత్తికాయరా భేమ్మణ ధాటి
సలాము తెచ్చే సాయబు భేటి
డూ డూ డూ డూ యెంకన్నా!

చెన్నపట్టణం చేరువరాదు
కాశీపట్టం కానకపోదూ
కాపవరమే కదలాలేదూ
డూ డూ డూ డూ యెంకన్నా!

చెట్టు కదిలినా పుట్ట వొదలదూ
నీరు పోయినా నాచు కదలదూ
గుడి పాడయినా గూబ వదలదూ
గుడిపాలాలు పూజారి వదలదూ
డూ డూ డూ డూ యెంకన్నా!

యేడుకొండలా యీశ్వరుడండీ
యెండి కొండలా యెంకన్నండీ
భమిడి కొమ్ములా బసవయ్యండీ
డూ డూ డూ డూ యెంకన్నా!

బాపిరాజు

## వార్త

ఉత్తరాలాసంచి నెత్తిపెట్టుక వచ్చు
కూలివానీ చేతి సూదిబల్లెపు టులివు
మాటుమ్రోయానేల నాదు నెదలో?
దారిగలసిన వాని పటుగులో నా నడక
తాటుమాటై త్వరన్ దలపనేల?

ఉత్తరాలా బరువు నొప్పఁజెప్పుట లేందె
తత్తటింపఁగనేటి కూర్చుతిత్తి?
చిత్ర మీ జీవనము, చిన్న యుత్తర మేదొ
ఎవనికేన్ గొనిపోవునేమొ, ఏమొ?

కవికొండల

## మూగనోము

బియ్యపు గింజలన్ చిగురుపేడిన గంధపు
పచ్చిబొట్టుతో తియ్యని చిన్ని నీ నొసలి తీరులు
కుంకుమ తీర్చి ముంగిలన్ తొయ్యలి,
నోముచారికలతో పసపాడిన ముద్దరాలు
నీ పయ్యెద వ్రాలు నీవు నతి పట్టిన దీవన
లీయఁ జూచెడున్!

నీ తెలిపట్టుచీర మెయినీడలు పారి
ముసుంగు సంజ క్రొంబూతల తెల్ల లేమొగిలు పోలిక
వాలికగాలిఁ దూలిపో నేత బెడంగుకుచ్చెలలు
నీ చిరుకాలుల ముద్దు తోచెనో
లేత పోరాడు పయ్యెద చలించిన
పచ్చనితాళి తోచెనో!

దూసిన నాగమల్లికల దోసిలులన్
తొలిజాముప్రొద్దు తా మూసిన కంటిమూత
తెరువుళ్ళయినట్టివి మందహాసిక న్యాసిత
పుల్లగల్లపరిణామము లచ్చపవళ్ళు శారదశ్రీ
సముపేతముల్ పులకరించెను
నీ మెడ గంధ పూతలన్?

కమ్మని పాలబుగ్గ వవుగా, పతికోసము
యిన్నినోములన్ కిమ్మనకుండ నోచెదవు, కేవల
మాతని నీ యెడంద క్రొందమ్మిపువుం
దుమారములు దమ్మిన చిక్కని తేనెపాలలో
చెమ్మల యూటలన్ మెదపి చేతువా
నెయ్యపు తియ్యముద్దగా!

ఓసి, మనోజ్ఞ నీరద నవోదయ కాల
వియద్విలంబమానాసిత వారివాహనివ
హాసనత్కైశిక! మూగనోములో కోసలు తేరు
కన్ తుదల కూడిన భాగ్యపు టెఱ్ఱజీరలో
మాసరమయ్యె నీ యెడద మాగిన నెయ్యపు
తియ్యదొంతరల్!

పైదలిచాలులో వ్రతము పట్టిన
నీకును తా వొసంగు ముత్తైదుల కాళ్ళ
వంగఁబడి తాకక కన్నుల నేర్దువేళ నీమీద
సరాగమాడ, పసిమీగడ చూపులు, నవ్వుపూలు,
భావోదయమున్ పొనర్చియు, తలోదరి,
నీ వ్రతరక్ష చేసెడున్!

కొసలకు నూనె రాచి కొనగోళుల
దువ్విన, కొండె చుట్టిన, వదులైన క్రొంజడ
ఘటించిన యెఱ్ఱని పోకబంతితో నిను నెదురైన
కుంకుమపు నీటులు గుల్కెడు మోముకన్నె
నేమని నుతియింతు ప్రాతరమృతాకృతిఁ
గార్యఫలోన్ముఖత్వమున్!

వినయము నేర్చుకోఁ జదువ బెట్టిరి
య్యైదువలైనవారి దర్శన సుకృతంబు నిత్యపరిసంగతి
తెచ్చిరి, యింతనుండి మాట నియమ
మభ్యసింపఁ గవటాకును ని న్నియమించి,
రీవు తెచ్చిన పతిశీలతాధికతచేఁ దెలుగుల్
పరిపూతులగుటకున్!

నీ నడయాడు త్రోవలు పునీతములైనవి
నీ దృగంత రేఖా నత వాయువీచిక
లనంత సుధా పరిషేచన క్రియాస్థానములైన
వోసి పసిదాన, భవన్నియమ ప్రభావ
సంధానముచేత నీ పతి సుధామయమూర్తి
సముజ్జ్వలించెడున్!

**విశ్వనాథ**

## మా తల్లి

తల్లిపా ల్దావకుండ బందాలc బడిన
వత్సములు లాగులాడెడుc బాలకొలకు,
అలకొట్టాల పెండెము లవల నెట్టి
మెడలవేసిన పలుపులు విడువరమ్మ!

తల్లిపాలు ద్రావిన మహోత్సాహపూర్తిc
బెనcగి చెల్లాట లాడెడు పెంపు మిగుల
నిరుగుపొరుగు లేcగల క్రీడ లరయరమ్మ!

బువ్వదుత్త నెత్తిని బెట్టి నవ్వుకనుల
అవిక cదొడుగని గొల్ల కుఱ్ఱది యొకర్తు
పోవుచున్నది పొందైన ముద్దునడల!

కలికి యొడిసెల వలెవాటుగాcగcదాల్చి
పిటుcదు లసియాడc జీరరాపిళ్ళతోడc
గాపుcగూతురు పొలములు గాయ నేగు!

చిన్ని బంగారు పూసల చెండ్ల వంటి
జొన్నకంకులు పండిన సొగసుచేల
ఎక్కడెక్కడ నుండియొ చక్కవచ్చి
వ్రాలుచున్నవి పిట్టలు రక్తిబెరయ
లేచిరావమ్మ మా తల్లి లేచిరమ్మ!

రాయప్రోలు

## వాల్మీకి

వాల్మీకి కవిచక్రవర్తి నీ వెవరు
సరస కవితా లతా శాఖలందుండి
యామని కోయిల యట్లు గూసెదవుc
ఎచ్చోటc బుట్టితిc వేడ పెరిగితివి?
యే తల్లి చనుcబాల నింత మహిమంబుc
గాంచితో చెప్పుము కవిసార్వభౌమ!

నింగిని భేదించు నీ మహోస్సృష్టి
యెదుట నీ చారిత్ర మెం దడఁగిపోయె?
గంగానదీ శీత గర్భంబునందు
నిదురించుచున్నదా నీ చరిత్రంబు?
అభ్రంకష హిమాచలాంతర కటక
గంభీర గహ్వరాగాధ శూన్యమున
మాఱుమ్రోసెడునె నీ మహనీయవాణి!

ఓ యాదికవిరాజ! ఓ దివ్యవాగ్మి!
యెన్నియేండ్లును బూండ్లు నేఁగెనో కాని
మున్ను హిమాలయ మోహనాటవుల
నీవు మీటిన కావ్య నిర్నిద్ర వీణ
నేఁటికి వినఁబడు నిఖిలదేశముల!

భావకిరణమ్ములు పడుగు పేకలుగ
నీ వల్లినట్టి రమణీయ దృశ్యంబు,
బంగారు స్వప్నంబు, ప్రజల నెల్లపుడు
నానందరసవార్ధియందుఁ దేలించు!

నీ చేయి సోకిన నిముసంబునందె
బంకమన్నైన రూపముఁ దాల్చి నిలుచు!
ఈ యింద్రజాలంబు నేడ నేర్చితివి
యీ శిల్పనైపుణ్య మెటు లలవడియె?

ప్రకృతిభాండారంపు ద్వారంబు దెఱచి
గుప్తరత్నంబులఁ గొల్లగొట్టితివి!
యాకాశమునఁ గల యన్ని తారకలు
కడలిగర్భమునందు గల జీవమణులు
సరితూగలేవు నీ సౌభాగ్యమునకు!

భావవారిధిఁ బూలపడవ నడిపించి
ముత్యాలరేవులో మునిఁగి యడుగంటి
పలురంగుమణులను వలలీడ్చి తెచ్చి,
నవ్యమౌ కావ్యమండన మొండొనర్చి
విశ్వసాహిత్యంబు వెలిగించినావు!

రామిరెడ్డి

# మహాకవి
## (గురజాడ అప్పారావు)

గుత్తునా యని జాతిముత్యాల్
గుచ్చినాఁడే మేలిసరముల.
ఇత్తునా యని తెలుఁగుఁదల్లికి
ఇచ్చినాఁడే భక్తితో!

నవ వసంతము, నవ్యవనరమ,
మావి కొమ్మల గమ్మ చివురులు,
పాటపాడెడి పరభృతంబును
ఎవ్వరాపుదురో?

పొడుపుమల పయి రంగవల్లిక
మింటి నడుమఁ బ్రచండ తేజము
సంజమబ్బుల పైని కెంపులు
చూడకుంటిరిగా!

రంగవల్లిక మాయమయ్యెను
చండతేజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను,
వెదకుచున్నారా!

కారుచీకటి- గ్రమ్మినప్పుడె
చదల మబ్బులు కప్పినప్పుడె
మిణుఁగురైనను మెరయునప్పుడె
వెదకుచున్నారా!●

చుక్కలన్నియు సొక్కి సోలెను,
గిరులు కదలెను, తిరుగఁ బాడెను
లోకమోహన మధురగానా
స్వాదమోదమున!

యుగయుగంబులనుండి మ్రోఁగెడు
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు, నాతని
గీతశీకరముల్!

పాట పాడిన పరభృతంబును,
మూఁగవోయిన ముద్దుకోయిలఁ
జిన్నిపికములు చిఱుతపాటలఁ
బిలుచుచున్నవియా!

కృష్ణశాస్త్రి

# రామలింగారెడ్డి

పిండీపిండని పాఁడియాఁబోదుఁగులన్
బింబింపఁ గాదంబినీకాండం, బుర్వర
పచ్చకోకలను సింగారింప, నీవేఁ బూదండల్
దక్కను ద్వారబంధముల సంధానించి
ప్రేమోద యీ యాఖండ స్వాగత మిత్తు రాంధ్రు
లనురాగ స్ఫూర్తి రెడ్ల్యగ్రణీ!

ఆజిన్ మార్మొగమీక, దిగ్విజయకన్యా
కంచుకంబౌ కుసుంబాజెండా నెగఁగట్టి
వాఙ్మయసరోమాధ్వీ పిపాసా రతిన్
మోజుల్మీరఁగ మా యనుంగుఁ
దెనుగుం బూదోట బోషించి రే రాజుల్
తత్ప్రతి భాంకరెడ్డికుల ధీరప్రాచురీచ్ఛాయ
నీ తేజోరూపమునందు చూచెదము ప్రీతిన్
రామలింగాగ్రణీ!

తొడిమయుఁ బూవు నడుఁ బొందికలుసూపు
పదభావముల కొక్క పా న్పమర్చి
విడెపునన్నియ పెదవిమెఱుం గలదినట్ల
లంకారముల నర్థలక్ష్మినేలి,
లతిక నికుంజవలయము నల్లినరీతిఁ
గథకుఁ దెంపునులేని గమక మిచ్చి

కలహంస కొలని యలలఁ బ్రోది గొనుభంగి
నుడుల కొయ్యారంపు నడలు నేర్పి,
రసికు రుచిరోపగూహనప్రమద మొకట,

వీరు నిజభుజాస్ఫాలనోద్వేగ మొకట,
ప్రకృతి తన వశమైనట్లు ప్రతిభతోడ
భారత మ్మేలె నే కవిబ్రహ్మమౌళి!

అతని తెనుంగు తీర్పుల రహస్యములం
గ్రహియించి తత్ప్రభాయత జయలేఖినీ ముఖ
నిరంకుశపాలిత భారతీకళాన్విత రసరేఖ
రాగిలిన నేర్పరి వంచు, త్వదీయ భావలాలిత
విలసద్విపంచిఁ గదిలింతుము నేడు
గుతూహలంబునన్!

చవిజూచితి స్వతంత్ర చైతన్య భావనా
మాంసలాంగల కవిహంస సూక్తి,
పాటించితివి స్వైరభావ భోగ రిరంస
నెసఁగు పరాసుల రసికలిప్స,
క్రీడించితివి ప్రౌఢి పేదెత్తు సూరన
సుకవి వాగ్దోహద శోభనమున,
వెలయించితివి కండగల తెనుంగునఁ గావ్య
తత్త్వ మానంద సూత్రముల సరణి.

నేడు నీకన్న నీ యాధునిక మహాంధ్ర
వాఙ్మయము నడిపింప నెవ్వఁడు సమర్థుఁ,
డెలమి నీ కంకణము ధరియించి ముందుఁ
ద్రోవఁ దీయుము రామలింగావతంస!

రాయప్రోలు

## బ్రహ్మర్షి

ఈ దివ్యర్షిపదమ్ము భారతమునందే పుట్టి
యాధ్యాత్మి క్రేచ్ఛాదారిద్ర్యమునన్ నశించు
ప్రియశిష్య శ్రేయమాసించి యా వేదానంత
పథమ్ములన్ గదలిరావే! తాల్చికోనిమ్ము
నీ పాదాంభోజ రజోలవమ్ము, గురుదేవా,
మా శిరోవీథులన్!

ఈ జడజీవితమ్ముఁ బలికించితి, వీ యఘ
పంకమందు నంభోజము మొల్వఁజేసితి,
వపూర్వము నే దయ, యీా నిశీథి నీరాజన
మెత్తినావు, విపులమ్మగు నీయెద నిండె నే
శరద్రాజిత చంద్రకాంతు, లమృతమ్ములు,
స్వర్గలతాంతవాసనల్!

నా యెదలోఁ ద్వదీయచరణమ్ముల చిహ్నము
లెన్న డేనియున్ మాయవ యే నిశీథపుఁ
దమస్సులు మూసినఁగాని, జీవయాత్రాయతవీధి
నొక్కఁడఁ బ్రయాణము సేయుదు నక్షయంపు
బాథేయముగా గ్రహించి గురుదేవ ముఖస్రుత
గీతికాసుధల్!

మా చిననాఁటిచిత్తము లమాయిక కోమలముల్
పదేపదే పూచిన వాని స్వప్నము లపూర్వము,
లిప్పటికేని నాఁటి సూఫీచరితామృతమ్ముఁ
గురిపించెడు మా గురుదేవుఁ డేలొకో తోఁచు
షరాయితో ఫగిడితో నెవరో యొక
ఫాదుశాహిగా!

'ఏ దురితాంధవహ్నుల దహించుకపోవు
జడుండ' నంచుఁ బ్రహ్లాదుఁడ వీవె, శ్రీ శుక
మహర్షివి నీవె, వచింపఁబోవ నేమౌదురొ
మమ్ముబోంట్లు వెలపౌను ముఖాముఖి
నో వినమ్రమూర్తీ, దరిశించినాఁడవుగదే
జగదీశుని, నెంతవాఁడవో!

అలనాఁటి ఋషివాటికలనుండి పరతెంచు
నామ్నాయపూత గంగామృతమ్ము,
అలనాఁటి బోధివృక్షాయత చ్ఛాయల
సెలలైన బాష్పశీతల జలమ్ము
అలనాఁటి కఱిమోడు సిలువగద్దియమీఁద
నురలిన రక్తవోష్ణధార,
అలనాఁటి యారబీయుల యెడారులలోనఁ
గాఱిన విశ్వాసఘర్మవారి,

కలిసి నీలోన లోలోనఁ గదలిపాఱఁ
బదనువాఱినదయ్య నీ హృదయసీమ,

తావక పవిత్ర జీవితధామమైన
దయ్యె విశ్వ విశాల దేవాలయమ్ము!

ప్రతిఫల మ్మిసుమంత వలవక కర్మముల్
సేయు నీ మెయి కురుక్షేత్రమగును,
అశాంతములకు జరాచరమ్ములకును
దరలు నీ యెడఁద బృందావనమగు,
వివిధ ధర్మజ్ఞానవేణీసమాశ్లేష
మైన నీ మనసు ప్రయాగ యగును,
పాతాళమును స్వర్గపద మొక్కముడిలోన
నతుకు నీవే వారణాసివౌదు!

నీవు కన్పడ నెదురుగా నిలిచినట్లె
మ్రోలను పురాణ భారత పుణ్యభూమి!
మాకు దినదిన దివ్యయాత్రా కృతోత్స
వానుభూతి నొసంగు బ్రహ్మర్షి వీవు!!

కృష్ణశాస్త్రి

# తిక్కన సోమయాజి

పూజాతిసాంద్ర కర్పూరమ్ములందు
ప్రాజ్ఞదీపాథోలవమ్ములయందు

మడగు సన్నని పాట
పాడుచు వెన్నెల తేట

కలవు తిక్కన వల్కు తెలుగు పల్కులకు!

లోలమృద్వీకా గుళుచ్ఛమాధురియు
నవ పుష్యరాగ సుందర పటిష్ఠతయు

అలరు మల్లియపువ్వు
నందు పిన్నని నవ్వు

కలవు తిక్కన పల్కు తెలుగు పల్కులకు!

కృష్ణవేణీ తరంగిణి మున్న ఝరియ
తుంగభద్రాసరీత్తున నూగు హేల

ధవళగోవ్రాతము
నవ నవనీతము

కలవు తిక్కన పల్కు తెలుఁగు పల్కులకు!

లజ్జామనోహర లావణ్యమూర్తి
తేజోరుణాక్షి సందీప్త పాంచాలి

కనుల క్రొమ్మెఱుపులు
కనుబొమ విరుపులు

కలవు తిక్కన పల్కు తెలుఁగు పల్కులకు!

**అబ్బూరి**

## రాధాకృష్ణ

దిగ్వధూగండ ప్రదేశమ్ము లందగిం
చిన త్వజయాంకవిశేషకమ్ము,
నిఖిల దిగ్దేశ పండిత సదస్సులు శిర
సా వహించిన ధర్మశాసనమ్ము,
అఖిల భూపాల శుద్ధాంత ప్రసాదన
గురువగు నీదు నాగరకముద్ర,
సప్తాంతరీప ప్రశస్తాపణముల నిం
డారు నీ రత్నభాండారములును
కథలు కల్లలు నితిహాసకాండ లగుచు,
బెండ్లు మున్గి గుండులు దేలువేళ, నో పు
రాణ పుణ్యావనీ, కుటీరమున నీకు
నిలిచెగా జ్ఞానదీపికాకళిక యొకటి!

చినుగుల్ గట్టిన శీర్ణదేహము
జరాజీర్ణమ్ముగా, బ్రాణముల్ కనులన్ నిల్పి
పరాభవావనతవై కాల్ సే వడంకన్
గృహంబున గాలక్షయమాచరించు తఱి

తల్పుం దట్టి యీ యర్ధరాత్రిని నష్టాత్మకులేరో
పిల్తురు నినున్ దీపమ్ము జూపింపుమా!

కవన పీయూష మొలికి యొక్కండు, సత్య
జీవకారుణ్యములు బ్రతిష్ఠించి యొకడు,
ఆజవంజవరోగార్తమైన ప్రాణి
సంతతికి బెట్టుచున్నారు శాంతిభిక్ష!

అమలోదాత్త మనీష సర్వనిగమాంతాంభోనిధుల్
గ్రోలి, బోధమయాచంచల చంచలాద్యుతుల
రాధాకృష్ణచిన్మేఘ మభ్రమునన్ వ్రేలె
నబోధఘర్మపరితప్త స్వాంతకేదారఖండములం
దద్వయతత్త్వ సస్యములు పండన్
సర్వ దిక్సీమలన్!

ఆలాపింపుము సర్వపండిత సదస్యాహ్లాది
తత్త్వార్థబాధాలీఢోక్తుల నీ మహాంధ్రజన
విద్యాపీఠికాశీర్షలోత్తాలప్రౌఢ
మహానుభావమున రాధాకృష్ణతత్త్వజ్ఞ
దిక్కాలాతీతము, శాంతితేజము వెలుంగన్
ద్వన్మనః పీఠికన్!

**పింగళి - కాటూరి**

# జగన్నాథుని రథచక్రాల్

పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!

బ్రతుకు కాలి,
పనికిమాలి,
శని దేవత రథచక్రపు
టిరుసులలో పడి నలిగిన
దీనులార!
హీనులార!

కూడు లేని, గూడు లేని,
పక్షులార! భిక్షులార!
సఖులవలన పరిచ్యుతులు,
జనులవలన తిరస్కృతులు,
సంఘానికి బహిష్కృతులు,
జీతాసువులు,
చ్యుతాశయులు.
హృతాశ్రయులు,
హతాశులై
ఏడవకం డేడవకండి!

మీ రక్తం, కలగి కలగి
మీ నాడులు కదలి కదలి
మీ ప్రేవులు కనలి కనలి
ఏడవకం డేడవకండి!

ఓ వ్యథా నివిష్టులార!
ఓ కథా వశిష్టులార!
పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
ఏడవకం డేడవకండి!

వస్తున్నా యొస్తున్నాయి....
జగన్నాథ,
జగన్నాథ,
జగన్నాథ రథచక్రాల్!
జగన్నాథుని రథచక్రాల్!
రథచక్రాల్,
రథచక్రాల్,
రథచక్రాల్, రథచక్రా
లొస్తున్నా యొస్తున్నాయి!

పతితులార!
భ్రష్టులార!
మొయిల్దారిని
బయల్దేరిన

రథచక్రాల్, రథచక్రా
లొస్తున్నా యొస్తున్నాయి!

సింహాచలం కదిలింది,
హిమాలయం కరిగింది,
వింధ్యాచలం పగిలింది-
సింహాచలం,
హిమాచలం,
వింధ్యాచలం, సంధ్యాచలం....
మహానగా లెగురుతున్నాయి!
మహారథం కదులుతున్నది!
ఘూర్ణమాన
ఘూర్ణమాన
దీర్ణమాన గిరిశిఖరాల్
గిర గిర గిర తిరుగుతున్నాయి!
పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
రారండో! రండో!! రండి!!!

ఊరవతల నీరింకిన
చెరువుపక్క, చెట్టునీడ-
గోనెలతో, కుండలతో,
ఎటుచూస్తే అటు చీకటి,
అటు దుఃఖం, పటునిరాశ-
చెరసాలలు, ఉరికొయ్యలు,
కాలువలో ఆత్మహత్య!
దగాపడిన తమ్ములార!
మీ బాధలు నే నెరుగుదును....
వడలో, కడు
జడిలో, పెను
చలిలో తెగనవసి కుములు
మీ బాధలు, మీ గాథలు
అవగాహన నా కవుతాయి!

పతితులార!
భ్రష్టులార!

దగాపడిన తమ్ములార!
మీ కోసం కలం పట్టి,
ఆకాశపు దారులంట
అడావుడిగ వెళిపోయే,
అరచుకుంటు వెళిపోయే,
జగన్నాథుని రథచక్రాల్,
రథచక్ర ప్రళయఘోష
భూమార్గం పట్టిస్తాను!
భూకంపం పుట్టిస్తాను!

నటధూర్జటి
నిటాలాక్షి పగిలిందట!
నిటాలాగ్ని రగిలిందట!
నిటాలాగ్ని!
నిటాలార్చి!
నిటాలాక్షి పటాలుమని
ప్రపంచాన్ని భయపెట్టింది!

అరె ఝూం! ఝూం!
ఝుటక్, పటక్....

హింసననణచ
ధ్వంసరచన:
ధ్వంసననణచ
హింస రచన!

విషవాయువు, మర ఫిరంగి,
టార్పీడో, టోర్నాడో!
అది విలయం
అది సమరం
అటో యిటో తెగిపోతుంది!

సంరంభం,
సంక్షోభం,
సమ్మర్దన, సంఘర్షణ!
హాలాహలం పొగచూరింది!
కోలాహలం చెలరేగింది!

పతితులార!
భ్రష్టులార!
ఇది సవనం,
ఇది సమరం!

ఈ యెగిరిన ఇనుప డేగ,
ఈ పండిన మంట పంట,
ద్రోహాలను తూలగొట్టి,
దోషాలను తుడిచిపెట్టి,
స్వాతంత్ర్యం,
సమభావం,
సౌభ్రాత్రం
సౌహార్దం
పునాదులై ఇళ్ళు లేచి,
జనావళికి శుభం పూచి-
శాంతి, శాంతి, కాంతి, శాంతి
జగమంతా జయిస్తుంది,
ఈ స్వప్నం నిజమవుతుంది!
ఈ స్వర్గం ఋజువవుతుంది!

పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
దగాపడిన తమ్ములార!
ఏడవకం డేడవకండి!
వచ్చేశాయ్, విచ్చేశాయ్
జగన్నాథ
జగన్నాథ
జగన్నాథ రథచక్రాల్
జగన్నాథ రథచక్రాల్
రథచక్రాల్
రథచక్రాల్ రథచక్రాల్
రా రండో! రండో! రండి!
ఈ లోకం మీదేనండి!!
మీ రాజ్యం మీ రేలండి!!!

శ్రీశ్రీ

# అడవి పూవు

పొడుపు కెంజాయ లాక్రమించెడు నవీన
సృష్టిచైతన్యమున వికసించియున్న
ఓ యడవిపూవ! నీయెద నూగులాడు
నీరవరహస్యములను వర్ణింపగలవె?

ఏ యొకరుఁడేని లేని దవీయమై
విపుల కానన వాటీ వివిక్త వీథిన
మఱచిపోయిన కోర్కులు మఱల మఱల
స్మృతికి రా హైమబాష్ప విస్రుతుల జార్తు!

"నేను నీవలె బూర్వజన్మానురాగ
కిన్నరీకంఠముల మృదుగీతిఁ బాడి
మోసులెత్తి నయానందముల లయించి
మఱచిపోతిని లోకులమాట లెల్ల!"

"నా గడచిపోయియున్న జన్మములయందు
నేను నీవలె కవిని, విమానమెక్కి
సప్తభువనమ్ములందున సంచరించి
మత్తిలితినోయి మధురసోన్మాదవశత!"

"ఈ ప్రపంచములోన న న్నీసడించి
తరిమికొట్టని వా డొక్కనరుడు లేడు
లే జిగురుటాకు టెద విదళించు పల్కు
బల్లెముల పోటుపొడవనివాడె లేడు!"

"హృదయమునయందు కార్చిచ్చు లెదిగి యెదిగి
ఆకసమునంట మంటల లోక మెల్ల
విలయమున గాల్చు జ్వాలల వేగివేగి
మనుజ జన్మమునందు నే మాడిపోతి!"

"దాచుకొన్న దాగని తీవ్ర దాహ మెల్ల
నా గళమునుండి ధరబడి రాగమై
అది గరళమయ్యె లోకుల కడుపునుండి
నా గళములోని శుష్కగానమ్ము లాగె!"

''నేను కవినయి బ్రతికియుండిన దినాల
స్వప్నములు గంటి; నొక వనచ్ఛాయలోన
నొక్కపువ్వునైన బాగుండునో యటందు
దాని ఫలలబ్ధి నేటిజన్మాన గంటి!''

''నా హృదయసౌరభముల గంధవహరాజు
తాను గొనిపోవు దశదిశాంతములదాక
నా యెడదలోని శాంత శృంగార గీతి
స్వరములను దాటి మ్రోగు నిశ్శబ్దరీతి!''

''నా కిఁక ప్రపంచమందున్న యీ కిరాత
హృదయముల నేమిపని యుదయించి సంజ
కెంపులంబడి నవ్వుల కిలకిలమని
శాంతిగొందును సాంధ్యనిశాంతవీధి!''

''మా కుసుమలోకమందున మరణమన్న
బెదురువాటున గుండియ లదరబోవు!
మధురనాయూర్మిలో నిశామధ్యమందు
నాదమఱతు మనంత రహస్య శయ్య!''

''ఓ కవీ! యీ వచించిన యూహలెల్ల
అల్లబోకు ప్రపంచాని కరిగి, దాని
పే రనిన మానసంపు టెడారి మధ్య
ప్రళయకాలాగ్ని పర్వతమ్ములు జ్వలించు!''

''నీవుగూడ నావలెనె యెదో విషాద
విపుల నిశ్వాస వాయువుల్ వెలికి జార్తు
నీకు గాబట్టి చెప్పితి లోకమందు
దీని వెలిబెట్టబోకు ప్రార్థింతునోయి!''

పెనుమర్తి

# నవాలోకము

లోకమ్ములో నవా
లోక మ్ముదయమయ్యె!
శోక మ్ముడిగి పాడు
మో కవీ, ఓ కవీ!

రాకాసుధాకరా
లోకోదయమ్మయ్యె!
చీకుచింతల మూను
మో కవీ, ఓ కవీ!

కరిమొగిలు చాయ లే
దరిని తేలని రేయి,
భరమ్మైన బ్రదుకైన
కరిగి పారెడు రేయి.

తెరుచుకో నీ తలుపు
అరసి రానీ పిలుపు
విరియనీ నీ వలపు,
ఓ కవీ, ఓ కవీ!

చుక్కలన్ని గోట
వొక్కమారే మీట
దిక్కుదిక్కుల వీణె
చొక్కి మ్రోసిన రేయి,

వెక్కియేడ్తు వదేల?
ధిక్కరింపుము శోక
కర్కశావేదనల
నో కవీ, ఓ కవీ!

''ప్రాలత్రోల'' తరంగ
డోల రిక్కలమీలు
తేలియాడుచు నింగి
మేలమాడెడి రేయి,

కేళికాభావనా
జాలమ్ము పర్వి, నీ
వేల యానందింప
వో కవీ, ఓ కవీ!

నిండు పున్నమరేయి
పండు వెన్నెల పూచె!
కొండకోనల శాంతి
మెండయ్యె, మెండయ్యె!

ఉండనీ నిట్టూర్పు-
బెండువారిన బ్రదుకు
నిండిపోనీ వెలుగు,
ఓ కవీ, ఓ కవీ!

విశ్వగానాలాప
నిస్వన మ్మాలింపు!
విశ్వదీపాలోక
రశ్మి సందర్శింపు!

నిశ్వాస నిర్ఘోష
విశ్వసింపకు నేడు-
శశ్వదానందమూర్తీ,
కవీ! ఓ కవీ!

విశ్వేశ్వరరావు

## జయభేరి

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!

నేను సైతం
విశ్వవృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను!

నేను సైతం
భువన ఘోషకు
వెర్రి గొంతుక విచ్చి మ్రోశాను!

★ ★ ★

ఎండకాలం మండి నప్పుడు
గబ్బిలంవలె
క్రాగిపోలేదా?

వానకాలం ముసిరిరాగా
నిలువు నిలువున
నీరు కాలేదా?

శీతకాలం కోతపెట్టగ
కొరడు కట్టీ
ఆకలేసి కేకలేశానే!

★ ★ ★

నేనొక్కణ్ణే నిల్చిపోతే
చంద్రగాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు
భూమిమీదా
భుగ్నమౌతాయి!

నింగినుండీ తొంగిచూసే
రంగు రంగుల చుక్కలన్నీ
రాలి, నెత్తురు క్రక్కుకుంటూ
పేలిపోతాయి!
పగళ్ళన్నీ పగిలిపోయీ
నిశీథాలూ విశీర్ణిల్లీ
మహాప్రళయం జగంనిండా ప్రగల్భిస్తుంది!

★ ★ ★

నే నొకణ్ణే ధాత్రినంతా
నిండిపోయీ,
నా కుహూరుత శీకరాలే
లోకమంతా జల్లులాడే
ఆ ముహూర్తా లాగమిస్తాయి!

★ ★ ★

నేను సైతం
ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను!

నేను సైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను!

నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను!

శ్రీశ్రీ

# నేను

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి,
ఏ నొక వియోగ గీతిక, నేను నిదుర
వెన్నెలలదారి నొక రేయి వెడలిపోతి
నొక విపంచీ విరహాకంత మొరసి యెగసి!

ఏ నొక వియోగశాలినీ హృదయరాగ
వేదనారేఖ, నాకయి వేగు నామె
యంగుళీ కిసలయ చంచలాంచలముల
విడివడి యనంతవిశ్వాస బడితి నాడు!

అదియె మొద లేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తి పోవ!

ఆ సమయ మాదిగా నప్సరోంగ నాను
రాగవీథుల, కిన్నెరీ రమ్యకంఠ
సీమలో, శ్రావణాంబు దాశ్లేషపాళి,
తారకాలోక పంక్తుల, మారు తోరు
పక్షముల, తిరుగాడుదు పవలు రేలు,
కన్ను మోడుపు మెయి వాల్పుగాని లేక!

ఇది ముగియబోని ఏ యర్థ మెరుగరాని
వేసటలేని వెర్రి యన్వేషణమ్ము!

ఈ ప్రవాస యాత్రారతి నిటులె నేను
కదలిపోవుదు నాశావకాశములను
ఒక్క నిట్టూర్పువోలిక, ఒక్క మౌన
బాష్పకణమటు, ఒక గాఢవాంఛ పగిది!

కృష్ణశాస్త్రి

# నీడ

అందాలు తానె చూసింది,
నీటిలో చందాలు తానె చెప్పింది
నాతోటి,
వొద్దున్న మందార వొంగి బొట్టెట్టుకుని
అందాలు తానె చూసింది!
సొగసెల్ల చూసేను సొమ్మసిలిపోయేను,
చెట్లంటి పాములే చెరువెల్ల పాకాయి
అందాలు తానె చూసింది!

ఆ వింతలన్ని చూసింది,
అప్పుడే ఆకాశ మడలిపోయింది
గజగజా వొణికి తా గట్లపై కొరిగింది.
సూర్యుడే చెట్టెక్కి చూడ భయపడ్డాడు!
అందాలు తానె చూసింది!

జుట్టెల్ల విరియబోసింది
మందార బొట్టెట్టి చెదిరి రాలింది
గట్లగుండెలు కలగ, మెట్ల కన్నులు చెదర-
వొంగున్న మందార వొంగియే వుండి ఆ
అందాలు తానె చూసింది,
నాతోటి

మందార మాటలాడింది!

బంగారమ్మ

# లీలా జీవితము

ఇసుక నేమొ వెర్రిగ నీవు వ్రాయుచుండ
స్ఫటిక మార్గాల నీ యేరు జారి యెట్లు
నీ రహో మోహ జపము ధ్వనింమనో!

నీ పెదవి కీ ప్రసవ మెట్లు వ్రాలునో? శ
శాంకరేఖ నీ సోయగ మ్మరసి తనను
లహరిలో మూచుకొని యెట్లు లజ్జపడునొ!

కామినీ! ఈ మనోజ్ఞ శృంగార భంగి
కెంత సులభమో ఈ జీవితైక పథము?
గాలికెరటాల దూరదూరాల పూల
కెటకొ లీలగా హాయిగా నెగసిపోవు!
ప్రకృతి కింతగా బ్రతుకు సులభమె, అయిన
కవికి, సార్థక ప్రేమసంకాశి కెంత
లీలయో నాకు......

రామచంద్ర అప్పారావు

# ప్రతిదినము

ప్రతిదినంబును బాట నేఁ జన,
ఎందఱేఁ బ్రజ నన్నుఁ గనుగొని
రాకపోకల బలుకరింతురు,
వారికిని నా కెట్టి యెఱుకయొ;
ప్రణయమార్గ మదే!
అదే!

నీరములపై నావ నెక్కిన,
గట్టుపై గల చెట్టు భ్రమఁ గొని
సగముదారినె కలిసికొనియెడు;
ప్రణయలహరి యదే!
అదే!

నిండు టాకన మరసి పరుగిడ
సూర్యుఁ డాది వెలుంగు లెల్లను
తలకు మీఱుచు నను గమించెడు;
వానికిని నా కెట్టి కట్టడొ;
ప్రణయభవన మదే!
అదే!

ఎంత చక్కని వార లైనను
సుంత వారల చూడ్కి నంటను,
ఎంత మోహన వృక్ష మైనను
దానియెడఁ జక్కానిఁ ద్రిప్పను,
ఎంత చోద్యపుఁ గాంతి యొదివిన
నంత కెక్కువయైన దెంతును;
ప్రణయలోభిని నేనె
నేనే!

**కవికొండల**

## పాత పాట

ద్వేషమేనా బ్రతుకుమార్గం,
వేషమేనా సత్యరూపం.
మోసమేనా నిత్యకర్మం
మూర్తి మంతులకున్?

ఇరుగు వారల కేది కూడూ,
పొరుగు వారల కేది గుడ్డ!
ఇరుగుపొరుగులు లేని మనసం
దొరలు దొంగలకున్!

ఆకటార్పులు జోలలా, మా
కాకయూర్పులు డోలలా, మన
బానిసల చెడుబ్రతుకులే, ఈ
ప్రభుల పానుపులా?

కూలినాలీబ్రతుకు, మనవులు
కొలువులూ, కోపాలు, కొర్రులు
చాలు మీ దానాలు ధర్మాల్
చాలు మీ భిక్షాల్!

కంఠమెత్తి గాన మెప్పుడు?
కలం హాయిగ ఖదం యెప్పుడు?
కంటిమాపులలో సముజ్జ్వల
కళలు తోచేనా!

పాత కతలూ, పాత వెతలూ,
పారి చనె, స్వేచ్ఛాపతాకము
నెత్తరా ఎత్తవేం, యెత్తూ
ఏడు ద్వీపాలన్!

**బాపిరాజు**



## పడవ

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!
పాడలేనే యెంకి పదము లీ రొాదలో!

పడవ సల్లగ నడిపి
పదము సదు వంటావు!
కస్సుమంటా యేరు
గాలి నెగబోసింది!

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!
పాడలేనే యెంకి పదము లీ రొాదలో!

హోరుగాలే పాట
దారి కడతావుంది!
బేటి కురికే పాట
నోట గొాడతావుంది!

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!
పాడలేనే యెంకి పదము లీ రొాదలో!

తల మలుపుకొాని పాట
తరిలింది కామోసు!
దేముడల్లే లోనె
తిరుగుతున్నా దేటొా!

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!
పాడలేనే యెంకి పదము లీ రొాదలో!

యెన్నెలంటే పాట
కెంత మను సవుతాదొ!
పాట సాగేతలికి
పయున మే మవుతాదొ!

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!
పాడలేనే యెంకి పదము లీ రొదలో!

నండూరి

# వ్యర్థయత్నములు

ప్రేమతో నా తులసి మొక్కను
పెంచితిని గంగోదకంబుల,
పసుపు కుంకుమ తోడ భక్తిని
పూజ లొనరిస్తి!

ఉదయ సాయంకాలముల క
ర్పూర దీపం బారతిచ్చితి!
హృదయ తాపము తీర లక్ష్మి
స్తవ మొనర్చితిని!

పక్కనే పొంచున్న లోకపు
మాని సొక్కడు పెదవి విరిచెను,
'ఎందుకో యీ వ్యర్థయత్నము
లెందుకో?' అనియెన్!

ప్రతిమ నొక్కటి మలచినా నది
ప్రతిఫలించిన దంద మంతా,
తనివి తీరగ విగ్రహంబు న
లంకరించితిని!

మంచినగలూ, మంచిగంధము,
మంచి మంచి రకాల పువ్వులు
ప్రతిమ కుంచితి, హృదిని నిల్పితి
తపము చేసితిని!

పక్కనే పొంచున్న లోకపు
మాని సొక్కడు పెదవి విరిచెను,
'ఎందుకో ఈ వ్యర్థయత్నము
లెందుకో?' అనియెన్!

కొత్తకొత్త రకాల విద్యలు
కొత్త ఆటలు కొత్త పాటలు
ముద్దు తల్లికి నేర్పు చుంటిని
మోద మలరంగన్!

చిన్నిపాదము లెత్తి నాట్యము
చిన్న పెదవులు కదిపి గీతము
చిన్ని చేతులు నెత్తి తాళము
తల్లి నేర్చినది!

పక్కనే పొంచున్న లోకపు
మాని సొక్కడు పెదవి విరిచెను,
'ఎందుకో ఈ వ్యర్థయత్నము
లెందుకో?' అనియెన్!

హృదయ భారము తీరు నంచును
మధుర భావము లేర్చి కూర్చితి
అడవిపువ్వులు గుచ్చి దండగ,
అరుత దాల్చితిని!

అనుభవించిన కష్టసుఖముల
నఖిలమును మథియించి, 'సారము
తీసుకొనుడో రండు! రం!' డని
తిరుగజొచ్చితిని!

పక్కనే పొంచున్న లోకపు
మాని సొక్కడు పెదవి విరిచెను,
'ఎందుకో ఈ వ్యర్థయత్నము
లెందుకో?' అనియెన్!

పక్కమానిసి పలుకు లన్నీ
పడెను నా చెవులందు విడిచితి
సర్వ మయ్యెడ, మౌనముద్రను
దాల్చి కూర్చుంటిన్!

శిరము వంచితి, కనులమూసితి
మౌనముద్ర వహించియుంటిని,
సక్కమానిసి పలికె మళ్ళీ
ప్రస్ఫుటముగాగన్!

'ఎందుకో యీ మౌన మూనుట
ఎందుకో యీ మాంద్యమంతా
పోయి సాంఘిక సేవ చేస్తే
పుణ్య ముండునుగా!'

**దీక్షితులు**

# దెబ్బతిన్న లేడి

ఆ యటవీస్థలిన్ ననుదృణాంకురము ల్దిని,
కొండవాగులన్ దీయనినీరు గ్రోలి,
పువు తీగల నీడల విశ్రమించి నే నే యపకారి
నైతినని యీ నిశితాంబక మేసినావు,
మీ బోయల కేగతిన్ దెలియబోలును
మామక సౌకుమార్యముల్?

నేయియు పాయసమ్ము దిన నేర్చిన
పెద్దల పాద సేవలన్ చేయగరాదె,
నీకు గల చెడ్డతనం బొక కొంత మాను,
స్వర్గీయ లతా నికుంజముల కిన్నెరసానులు
వోవుదారులన్ బోయెద, నింక నాకు సెలవుం
దయజేసి, క్రుధన్ దృజింపుమీ!

కాలము తప్పె, మా తబిసికన్నెక లక్కటట
మద్వియోగమున్ దాలక, నాకునై
యెదురుదారులు సూతురు; బోయకాంత,
యిట్లేల వృథా గుమారిలెదు?
నీ వయినం జని వారలందరున్ బేలతనాన
కంట తడివెట్టకయుండగ నూరడింపుమీ!

పేరిమి బూలువెట్టి తినిపించి, మరందమువోసి
సంజలన్ జేరువ దీసి యాడి, యరచేతులబెంచిన
తాపసాంగనల్ లేరిట, నాదు పాపము ఫలించిన
యీా యవసానపున్ సమాచారము
నంత్య బాష్ప కణజాలముతో నయినన్
వచింపగన్!

కొడాలి

# ఆశ - నిరాశ

పెరటిలోనున్న యేడాకు లరఁటిచెంతఁ
బెద్ద బావిజలంబులఁ బెంచుకొన్న
మావిమోకకుఁ గననయ్యెఁ గావిచిగురు,
కావిచిగురున కాసించి గళము నెత్తి
గండుకోయిల పాడె రాగంబు లొలయ!

చివురువెట్టని కొమ్మలఁ జిన్నిపూలు
తావు లింపార వికసించె, దానఁజేసి
మేలుకొలుపులఁ బాడుచు నాలితేటిఁ
యొక్కరీతినె చిందులు ద్రొక్కఁ దొడగె!

కాంచుచుండగ నాకస్మికంబుగాఁగ
నెట్టి పాటుననో మఱి యేమొ కాని
చిగురు నశియించెఁ, బూవులు చిందిపోయెఁ
జిన్నికోకిల యంతలోఁ జిన్నవోయెఁ,
దుమ్మెదకుగూడ నేమియుఁ దోచదాయె,
విషమ విశ్వంబునకు నిది వింత పనియె!

వేంకట పార్వతీశ్వరులు

# ద్రాక్షావీధి

నేడు నా ద్రాక్షపందిరి నీడలందు
స్వాదురసభారవశమున వ్రాలిపోయె
గెలలు గెలలుగ జారిన ఫలచయమ్ము
రాజరాజేశ్వరీ, వేగిరమున రమ్మ!

చిరదినమ్ములనుండి పెంచిన మదీయ
ద్రాక్షవీధీనికుంజమధ్యమున నిల్చి
జన్మజన్మాంతరము పరిశ్రమము నెల్ల
సఫల మొనరించి పోదువు, సాగి రమ్మ!

చల్లని సమీరములకు కంపిల్లుచున్న
మధురఫలగుచ్ఛములలోని మదిర నోడ్చి
భావ ముప్పొంగ మణిమయస్వర్ణపాత్ర
లందు నిండార నింపెద, నందికొనుము!

మొక్కనాటిన సుదినము మొదలు నేటి
వరకు నీ వెన్న దుజ్జ్వలవాహనమ్ము
నందు నాసీనవై వత్తువా యటంచు
వేచికొనియుంటి, నింక నావేళ వచ్చె!

ఫలగులుచ్ఛము లన్నిటి బాసి, రిత్త
వోయినను పోవనిమ్ము, నా పూర్వవాటి
ప్రథితధనధాన్యబహుళభారమ్ము కన్న
నీవలన కల్గు లేమి, శోభావహమ్ము!

తెచ్చుకొన్నదికా దీయతీవకఠిన
వాంఛ; జంగమస్థావరవర్గ మెల్ల
కోరుకొనుచుండె నిదె గుసగుసలతోడ!

ఆ మహాశక్తికై వినయాంజలులను
భూతసామ్రాజ్యమెల్ల కేల్మోడ్చి యొసగు,
ఎంత గుహ్యమొ కద ఈ యనంతపథము,
ఎంత యజ్ఞేయమో యెట్లు తెలుగవచ్చు?

అబ్బూరి

# నీవు - నేను

సుఖము ఫాలమునందు వ్రాసుకుని యెవరు
పుట్టిరో వారికి వసంతము సుమనోజ్ఞ
మైన గానిమ్ము, నాకు నీ వన్న, మేను
జలదరించున ఓయి ఆషాఢజలద!

నిను మదీయగిరాంవీథి నిలిపి శైవ
సాంధ్యతాండవనూపురస్వనము లొలుక
జేసితిని, నీవు మింటికి, క్షితికి నేను,
కవుల మైతిమి హృదయ దుఃఖములు పాడ!

నీవు జగమున జీకట్లు నిండఁజేయు,
వెలుగు చొరరాని యింటి మూలలకుఁ బ్రాకి
ముసుగుదుప్పటిలో కన్ను మూతవెట్టి
పాదలు పెనుచీకటిని శాంతి వెదకికొందు!

విశ్వనాథ

# ఆశయము

కడలినట్టడగు పాడము
ముత్తియము! నీదు కాంతిన్
బడయఁగను మునుఁగవలెనా?
వల లెన్నో పన్నవలెనా?

ఈ నాదు తీరమందే
భంగముల వెలికిఁబడెడు
గుల్లలను గూర్చుకొనుచు
నే నేల యాడరాదో?

ఆకసము నట్టె పాడుచు
చుక్కరో! నీదు కాంతిన్
చేఁబట్ట నెగురవలెనా?
ఱెక్క లూనంగవలెనా?

నే నేల నిలువరాదో
ఈ నాదుపొలము నడుమ
క్రింది కీ వెపుడు పడెదో
యపుడె ని న్నరసికొనుచు?

సంతుష్టి లేదు మదికిన్
సంతసము లేదు తుదికిన్,
ముత్తెసరి కెఱుఁగువఱకు
ముక్కజిగి కెగయువఱకు

కవికొండల

## గఱిక

దారి కోవలక్రేవ దనరారు గఱిక?
యెంత మెత్తందన మెంతటి ప్రోది
యెంత క్రొత్తందన మిగురొత్త నీవు
మొన్నగాఁ గురిసిన ముత్యాల జడికి
మురిపాల గుబురువై పెరుగుచున్నావె?

దైవసృష్టిని నీకుఁ దా వొండు గలదు!
నేనును నీపైన నెన రూనియుందు;
ఏను నీ వైతినో యెవరికిఁ దెలియు
మున్ను గతించిన పుట్టువులందు!
ఈవు నే నౌదులో యెవరెఱుంగుదురు
రాఁబోవు జన్మాల రాకపోకలకు!

గుసగుస చెప్పెదు, గునిసి యాడెదవు
నీలోన వెలిగెడు నిర్మల జ్యోతి
వెలికొత్తఁ బోరాట పెట్టుచున్నదియొ!

నీ యందచందంబు నీ సంతసంబు
నందుఁ బాల్గొన నాదు డెంద ముప్పొంగు!
పంచవన్నె ముసుంగు వలిపంబు క్రింద
నొకవేళ నిరువుర మొకరమే యేమొ?

రామిరెడ్డి

# జంట నా యెంకి★

యెనకజల్మంలోన
యెవరమో నంటి,
సిగ్గొచ్చి నవ్వింది
సిలక నా యెంకి!

ముందు మన కే జల్మ
ముందోలె యంటి,
తెల్ల తెలబోయింది
పిల్ల నా యెంకి!

ఎన్నాళ్ళు మన కోలె
ఈ సుకము లంటి
కంట నీ రెట్టింది
జంట నా యెంకి!

నండూరి

★ యెళ్ళి నా యెంకి

# నా స్థితి

ఈ కెలన శరత్పూర్ణి మావృత శశాంక
లలిత రోచిర్వితాన, మా కెలన ఘోర
ఘనత రాంధకార చ్ఛటా క్రాంత భూమి,
అందు సగ, మిందు సగ ముంటి; నవుర నేను!

ఈ శరత్పూర్ణిమాచంద్రికాసుధా మ
రీచిలో నన్ను నేను స్ఫారీభవన్న
వీన శంపాలతాకృతి పూనియుంటి!

ఈ సగము నాకు నాకె కన్పించఁబోదు;
ఉగ్ర రాహు చంద్రార్ధ బింబ గ్రసనము
పోలె నున్నది నా స్థితి!

విశ్వనాథ

# ఎడారి

తలిరుప్రాయమ్మునకె కోరికలు కృశించి
మోడువలెనున్న జీవితమ్మునె వరించి
తనివివోని విషాదగాంధర్వగీతు
లల్లుకొని యీ యెడారుల కరుగుచుంటి!

మలయపవనంపు కౌదమల కులికిపోయి,
వెచ్చని యెడారి వడగాడ్పు నిచ్చగించి,
ఎండమావుల చల్లని కొండవాగు
తీరములయట్ల దప్పి తీర్చుకొంటి!

సంజచీకట్లు వచ్చి నిశ్వాసవాయు
వీజనమ్ములువేసి, యుర్వీతలాంత
రాళ సుఖదుఃఖ శూన్య పర్యంకమందు
తొట్టిలోపల నన్ను జోకొట్టిపోవు!

మామక క్షుద్ర దేహ నిర్మాణమందుఁ
దవిలి వచ్చిన పంచభూతములు గూడ
నీ యెడారిలో న న్నావరించుకొనుచు
కంటి కొక ఱెప్పలాగునఁ గాచుకొనును!

పెనుమర్తి

# నెమిలికన్ను

ధగధగమెరిసే కాంతిని చల్లే
కళ్ళు నెమిలి కెవ రిచ్చారో,
పురి విప్పుతు అది నాట్యమాడగా
తాండవకృష్ణుడు జ్ఞప్తికి రాడా?

మేఘాలందం నీలాలందం
కాంతల కాటుక కన్నుల అందం
అందాలన్నీ జీవం దాలిచి
నీలో నాట్యం చేసేనే!

జ్ఞాపకముంటే చెప్పరాదటవే
కృష్ణుని బాల్యక్రీడలు మాతో!
కృష్ణునివేణికి నీవా అందం
నీకే అందం ఆ వేణా!

చెప్పరాదటవే, చిన్నికృష్ణునీ
కూకటిముడితో తాండవమాడిన
నాటివైభవము నీదే అయితే,
కృష్ణగాథలను కర్ణామృతముగ!

ఆనా డామురళి లాలించితివట
గోపాలోన్నత శిరమున నిలిచి
మురళీమోహన దివ్య గీతముల
ప్రతిబింబములా నీలో తళుకులు!

నిన్ను బాలకులు నిత్యము కోరుతు
నీతో ఆటలు ఆడేవేళల,
వారు కృష్ణులను భావము పుట్టును
నిజమంటావా కాదా చెప్పవె?

దీక్షితులు

# వరద గోదావరి

ఉప్పొంగిపోయింది గోదావరీ-తాను
తెప్పున్న యెగిసింది గోదావరీ!

కొండల్లొ ఉరికింది
కోనల్లు నిండింది
ఆకాశగంగతో
హస్తాలు కలిపింది,

ఉప్పొంగిపోయింది గోదావరీ-తాను
తెప్పున్న యెగిసింది గోదావరీ!

అడివిచెట్లన్నీని
జడలలో తురిమింది,

ఊళ్ళు దండలగుచ్చి
మెళ్ళోన తాల్చింది.

ఉప్పొంగిపోయింది గోదావరీ-తాను
తెప్పున్న యెగిసింది గోదావరీ!

నడులలో గర్వాన
నడలలో సుడులలో
పరవళ్ళు తొక్కుతూ
ప్రవహించి వచ్చింది,

ఉప్పొంగిపోయింది గోదావరీ-తాను
తెప్పున్న యెగిసింది గోదావరీ!

శంఖాలు పూరించి
కిన్నెర్లు మీటించి
శంకరాభరణ రా
గాలాప కంఠియై

ఉప్పొంగిపోయింది గోదావరీ-తాను
తెప్పున్న యెగిసింది గోదావరీ!

నరమానవుని పనులు
శిరమొగ్గి వణికాయి,
కరమెత్తి దీవించి
కడలికే నడిచింది

ఉప్పొంగిపోయింది గోదావరీ-తాను
తెప్పున్న యెగిసింది గోదావరీ!

బాపిరాజు

## ఆ కొండ

మంచులో మునిగింది
మాయమై పోయింది
ఆకాశమున గలసెనో

ఆ కొండ
అక్కడే [1]పడియుండెనో!

రైలులోపల నేను
రాబోతు వున్నాను
నను జూసి వెనుదిరిగెనో!
ఆ కొండ
నైజమే అటులుండెనో!

వడివడిగ లేచింది
తడబడుతు నడిచింది
మరుగుపడి నను జూడ
పరుగిడుతు వచ్చింది;
హడలుతూ నిలుచుండెనో!
ఆ కొండ
అక్కడే పడియుండెనో!

జరజరా నడిచింది
గిరగిరా తిరిగింది
ఒలు తిరిగి తాను పడెనో!
ఆ కొండ
తల తిరిగి బారు మనెనో!

పరుగు పరుగున నాతో
పయనమ్మై ఆ కొండ
సరుగున్న రాబోతే,
దారి కడ్డము నిల్చి
సరివి తోటలు దాటెనే
ఆ కొండ
తలయెత్తి నను చూసేనే!

ఏల చూసెద వంటి
ఏమి కావలె నంటి,
ఎంత పిలిచిన పల్కదే
ఆ కొండ
పంత మేమో దెల్పదే!

1. నిలుచుండెనో

డబ్బుతే అను పలుకు
విడువకను పళ్కోటి
వడినడక రైలుతో
తను కూడ చనుదెంచేనే,
ఆ కొండ
తడయకను పయనించెనే!

ఇంతలో ఆ కొండ
సొంత రూపము దాచి
వింతరూపము తాల్చెనే!
ఆ కొండ
పంతమున పడిపోయెనే!

చలియున్న జడవదే,
పులియున్న వెరవదే;
మలయానిలుని దాచునే!
ఆ కొండ
మంచుకొం డనిపించునే!

మంచుకొండైతేను
మనకొరకు తా నేల
మరచిపోయీా చూసునే
ఇది నాకు
మది దోచకను పోయెనే!

గిరికన్య శ్రీగౌరి
వరతనయులము మేము;
గురితప్పిపోయినాదా?
ఆ కొండ
గుణము తా మారినాదా?

కొనియాడలేదన్న
కోపమున తా బోయి
కొండపాదుగున కూలెనే;
ఆ కొండ
గుండె రాయిగ మారెనే?

ఒరులు పో శక్యమా?
పరులు తే శక్యమా?
నను విడిచి ఆ కొండ
నల్లరాయైపోయె;
యెంతచూసిన చూడదే,
ఆ కొండ
ఎంత పిలిచినా పల్కదే!

బంగారమ్మ

# జైలులో చందమామ

చింత శల్యావశిష్టయై చిక్కి చివికి
నవసినమృగాక్షి స్విన్నాననమ్ము దోచు,
కృష్ణపక్షమ్మ! న న్నీ వొకింత మా గ
వాక్షముల తొంగిచూచెడు పక్షమునను;

రాతిగుండెలు గలిగిన రాచభటుల
కర్కశాఘాతముల మేను కందిపోయె,
శీతలహిమాంబు కణముల చిల్కరించు
అమృతకిరణాల స్పృశియింపుమయ్య మమ్ము!

అకట, మరియింత కృశియించినట్టి మేను
సాంధ్యపవనమ్ములు స్పృశించి చాలనాళ్ళు
గడిచె; జ్యోత్స్నా ప్రసాద శీకర పరంప
రాభిషేకమ్ము చేయింపుమయ్య మాకు!

తెల్లమబ్బుల కెరటాల తేలిపోవు
నట్టి భవదంతరిక్ష ప్రయాణము గన
ఇనుప తలుపుల నడుమ వసించు మాకు
నుల్ల మూహాతరంగాల నూగుచుండె;

నవ్యతారాపథమ్ముల నడచు నిన్ను
నే కిరీటాధిపతులు బంధింపగలరు?
కష్టతర దీర్ఘయామినుల్ గడచి వేగ
బంధనవిముక్తులను జేయవలయు మమ్ము!

బంధనాలయు బాహ్య ప్రపంచవార్త
లితరములు మాకు రాకున్ననేమి; సురవ
ధూ కపోల కర్పూర మధుర పరిమళ
పులకిత రహస్యములనెల్ల దెలిపి పొమ్ము!

ముకుళితములైన కలువపూవుల దళాలు
నీ కరస్పర్శ పుల్కరించిన విధాన
ఎన్నడో మూగవడిన నా హృదయవీణ
తీగ లొకసారి కదలి నదింప దొడగె!

అంబుదమ్ముల నీ కృపాంబుపాదృష్టి
పోల్చి రత్నాకరుడు పొంగి బోర్లపడును,
అట్టి నీవేడ, స్వాదుభోజ్యములకేని
నోచుకొనని బంధితుని సంతోష మేడ?

క్షితిని నీకెట్టి మూర్ధాభిషిక్తుడైన
నూలు పో గొక్కటిచ్చి సంతుష్టి జెందు,
హర్షముక్తాశ్రుల సువర్ణహారములను
గూర్చి నే నిప్పు డర్పించుకొంటి నీకు!

కొడాలి

## చైత్రము

వచ్చె చైత్రమాసము!
వాసంత విలాసము!

చల్లగాలి వీచె వీచె
మెల్లమెల్ల జల్లు లేచె
పిల్ల లతల పూత విచ్చె

వచ్చె చైత్రమాసము!
వాసంత విలాసము!

గున్నమావి క్రొన్ననతో
సన్నజాజి మన్ననతో
ఎన్నరాని చిన్నెలతో

వచ్చె చైత్రమాసము!
వాసంత విలాసము!

చెల్లెల! ఇద్దరమొకటై
మొల్లలమై మల్లెలమై
ఎల్లవేళ లాటలపై
వుచ్చుద మీ మాసము!
వాసంత విలాసము!

రెక్కలు కట్టుకు మేఘము
లెక్కుద, మెంతటి సౌఖ్య, మి
కెక్కడి దక్కడ దుఃఖము;
చుక్కలింట వాసము,
చుక్కలె సావాసము!

ఏడువన్నె లాకాశము
ఆడునుగా మనకోసము
పాడునుగా మనకోసము!

వచ్చె చైత్రమాసము!
వాసంత విలాసము!

విశ్వేశ్వరరావు

## కప్పతల్లి పెళ్ళి

కప్పతల్లీ పెళ్ళి నేడూ, చూడరే,
కావెళ్ళ నీ ళ్ళొంపినాడు!

వరుణదేవుడు పంపినాడూ, ఓ చెలీ
వాడలన్నీ నింపినాడూ!

గగనతలమునుంచి నేడు, పీవనలు
చెట్లచే వేయించినాడు!

స్వర్గాధినాథుడు నేడూ, రథమెక్కి,
పయనమై పోతువున్నాడు!

భత్యాలు లేకనే వాడు పెళ్ళికి
బాజాలు వేయించినాడు!

బండరాళ్ళపైని వాడు చక్రములు
బడబడా దొర్లించినాడు

బాణసంచా వెలితి లేదే, పెళ్ళికి
బహుబాగుగా చేసినారె!

కళ్ళుచెదిరే మెరుపులమ్మా, చూడు
వొళ్ళు వరవశమౌను సుమ్మా!

కప్పమ్మ పెళ్ళికో యంచూ, మేళములు
గొప్పగా తెప్పించినారె!

చెప్పశక్యముగాదు వేరే, బోదురూ
కప్పలామేళములు రారె!

కప్పమ్మ గడప తొక్కినదీ, శుభమన్న
సూచనలు మూరు చెప్పినది!

కప్పలెగిరే వానలమ్మా, పొలములూ
కనకమే పండుతాయమ్మా!

**బంగారమ్మ**

## వర్షాగమము

రసికహృదయము లోలలాడే
మునుపు దినములు మరలి వచ్చెను,
మిసిమి మబ్బులు వ్రేలు మేలిమి
ముసుగుతో నాకసము విచ్చెను!

తరలి రా, ఆషాఢలక్ష్మి
మెరపు తీవలు తొలకు రథమున,
మురిపెమున దిక్కాంత లలరగ
తరలిరా! మేఘముల పథమున!

పది కెలంకుల నూడ్చి పల్లీ
మదపతుల కానుకల నుంచిరి,
మొదటి చినుకులతోడ మెఱసే
పొదుపుతో మోములను వంచిరి!

వేకువలలో శంఖ మొత్తుచు
లోకముల నిక మేలుకొల్పుము,
శ్రీకరములగు తఱపివానల
శీకరము నాకిళ్ళ నిల్పుము!

మంగళాస్నానమ్ము లారిచి
వెంగలించెడు నీటికాలువ
పొంగిపోయె; నొసంగు పృథివీ
ప్రాంగణములకు పచ్చశాలువ!

అడవికోనలలోన నీకై
యెదరు వేచిన నెమిలికన్నెల
కడుపుకోతల మాన్పి, దాహము
లుడిపి పఱపుము చల్ల వెన్నెల!

ఉరుము లురిమెడు గర్జనమ్ముల
మెఱుపుతీవల మేలవింపుము,
మురిసియాడెడు వాన చినుకుల
సరసగానము లాలకింపుము!

అబ్బూరి

# కార్తీక పూర్ణిమ

పక్షుల్లు పలుకకే పడియుండినాయి,
వృక్షాలు చూచుచూ వూరకున్నాయి,
తన వెంటపడుతున్న
తరుణి జూడ డిదేమి!
పోతువున్నాడు తాను,
అడుగడుగో పొంగులోకాలు గనను!

గాలి ఉయ్యాలలై కదలుతుండెడి మబ్బు
కనుల కడ్డమురాగ, కాలైన తడబడక,
పోతువున్నాడు తాను,
తన గర్వపొంకములు దెలుపుతూను!
వాద్యములు వినబడవొ, చోద్యములు కనబడవో
నిముసంబు నిలువ డేనీడ నిలుచునొ గాని
పోతువున్నాడు తాను,
గర్వంపుపొంగు బోకారిపోను!
పక్షి కలకలములే పరిభవం బనియెంచి
తెల్లబోయిన మోము తెలియకుండుటకునై
పోతువున్నాడు తాను,
తను వెల్ల తారుమా రగుటతోను!

బంగారమ్మ

## ఒకరాత్రి

గగనమంతా నిండి
పొగలాగు క్రమ్మి
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను!
ఆకాశపు టెడారి
అంతటా అకట!

ఈరేయి రేగింది
ఇసుక తుఫాను!
గాలిలో కనరాని
గడుసు దయ్యాలు
భూ దివమ్ముల మధ్య
ఈదుతున్నాయి

నోరెత్తి హోరెత్తి
నొగులు సాగరము
కరి కళేబరములా
కదలదు కొండ!

ఆకాశపు టెడారి,
లో కాళ్ళుతెగిన

ఒంటరి ఒంటెలా
గుంది జాబిల్లి!

విశ్వమంతా నిండి
వెలిబూదివోలె
బహుళ పంచమి జ్యోత్స్న
భయపెట్టు నన్ను!

శ్రీశ్రీ

# అంధకారము*

[1]కారుచీకటి పేరుకొనియెను!
కడలి, మ్రోతల మారుమ్రోగెను,
దారుణంబగు నంధకారము
దారితెలియదుగా!

అచ్చటచ్చట మిణుగురైనను
[2]జొచ్చి వెదకిన లేరు కనగా
హెచ్చు మోదముతోడ నేగెద
వేమి కనుగొనగా!

భయముగొల్పెడు [3]కారుసంద్రము
బాగుగా గనుగొందువా, యట
[4]సార మెరుగని ఆ యెడారిని
[5]భయము పుట్టదుగా!

చే టెరుంగవు, పా టెరుంగవు,
[6]చెప్పినను వినరాదొకో, యట
కారుచీకటి [7]బోరుమనియెను
కడలి మ్రోతలతో!

విశ్వసుందరమ్మ

★ శీర్షిక పాఠాంతరం ''మృత్యువు జలధి''

1. కడలమబ్బులు
2. ఎచ్చటను గనరాదు వెదకిన
3. నీలనార్ద్రిని
4. అంత మెరుగని అంబుధిం గన
5. నడలు
6. చేరబోదువు మృత్యు జలధిని
7. భోరుమను నట

## ప్రతీక్ష

ఉదయభానుడు పంచిపోయిన
హృదయ సౌవర్ణ జ్వల న్మణు
లొదిగి యొదిగి యనంతకాలపు
టుదరమున మణగెన్!

ఉదయబాల విహంగమంబుల
మృదుల కైశోర శ్రుతులపై
గుదులు గుదులుగ కాలచోరుడు
వదులు బాణమ్ముల్!

ప్రాతరరుణ నవసువర్ణ
జ్యోతులూగే తూర్పుదిక్కున
లో తెరుంగని కాళరాత్రులు
రౌతులై నిలచెన్!

పెనుమర్తి

## తమస్సు

కనుమూసి లేచాను, వెనుదిరిగి చూశాను,
కనలేదు ఆ జంట, వినలేదు ఆ జాడ,

గుండె గుబగుబ లాడెను,
నా గొంతు
ఎండి, గుట కడదాయెను!

పిలిచాను పిలిచాను, అలసిపోయాను,
అలసిపోయినగుండె అట్టె ముడిపోవ

ఆకాశమున కెగిరితి,
అక్కడా
అంధకారమె చూసితి!

కేక వినబడదాయె, చూపుకనబడదాయె
అంధకారములోన అట్టే రెక్కలు ముడిచి

అవనిపైనే బడితిని
అక్కడా
అంధకారమె గంటిని!

బంగారమ్మ

## సమాలోచనము

ఇది నితాంత తమఃక్రాంత, మిది దరిద్ర,
మీ నిశాంతమ్ము శూన్య, మిం దెన్నడో ర
హ శ్శిథిలసుప్తి గలవరమంది, లేచి,
గుబులుకొను, లేతనెత్తావి గుసగుస లెవా!

అంత నీ యంధమందిరమందు, నొక్క
రెప్పపాటు వేకువ, ఒక్కరెప్పపాటె,
ఉన్మిషిత జీవనాగమ నోత్సవమ్ము,
ఉదిత గీతాప్రవేశ ముహూర్తవేళ!

అప్పుడే గృహనేత్రవాతాయనముల
కొలుకులందు, లే వెలుంగు తలుకు జివురు,
లరుణ మసృణ పంక్తులల్లు నేమొ
ఆడునేమొ, వాడిన మోము లట్టే వాల్చు!

తెరచికొన్న ద్వారము జొచ్చి, విరిసికొన్న
వాకిలిం జేరి, మంగళవాద్యపాళి
గద్గదిక వోవ సవరించి గళము, పాడు
నేమొ నిర్జీవ నిశ్శబ్ద మిట్టె మూగు!

మరల గ్రుడ్డి రాతిరి పడు, మరల నోరు
కావి శ్రుతులేవి లేని చీకటులు మరల
మరల పాడిలు.....

కృష్ణశాస్త్రి

# దీపావళి నాడు

నిశీథిని

"జగతి యీనాఁటి యీ మహోత్సవమునందు
మునిఁగి యానందమునఁ బొంగిపోవుచుండ
ఇటు రగులుకొల్పి రెవరు నీ హృదయమందు
వణఁచుకొనియున్న ఘోర[1]దుఃఖాగ్ని నిపుడు?"

నేను

"కాఱుకొన్న యమాస చీఁకటుల నడుమ
నే నొకండనె ఈ శూన్య గృహమునందు
అదురు పడిపోయి మరణ వాద్యమ్ము లట్లు
గుండియలు కొట్టుకొన నేడ్చుకొనుచుంటి!"

"ఇంతగ దహించుకొనుపోవు నీ యెదంద
బాష్పములు జారిపడి చల్లఁబడునొ యనుచు
మూసికొనిపోయి నా నేత్రములు దమంత,
రాత్రియే ఇంక బహి రంతరముల నాకు!"

"విస్మృతోదంతములు శూన్యవీథులందు
నావలనె మౌనముగ వెళ్ళిపోవుచున్న
ఓ నిశీథిని! నీ [2]గభీరోదరమున
దొరకె నీ దురదృష్టవంతునకుఁ జోటు!"

చిమ్మట

"బాణసంచుల ఫెళ ఫెళార్భటులు విరిసి
దశదిశాంతములఁ బ్రతిధ్వనుల నీన,
పేదపడియున్న మౌన జీవితపు టాశ
లిపుడు ప్రోఁగించుకొనుచుంటి వేల నీవు?"

1. దుఃఖానలమ్ము 2. వినీలోదరమున

## నేను

''నన్ను నిరసించు వారియానంద మందు
నాకు భాగమ్ము వల దొక్కనాఁటికైన,
చీఁకటులఁ జీల్చికొనివచ్చు నీకరాళ
గాన రవములనె నా సుఖమ్ము కలదు!''

''దినములు పరస్పర ప్రతిధ్వనులు కాఁగ
ఇరువదైదేండ్లు నా బ్రతుకిట్లొగడచె,
ఈ రహో దుఃఖ వీథులందే నెఱుంగ
సఖుల యడుగులజాడ లీ సరికిగూడ''

''ఎడతెఱిపిలేని కన్నీటిజడులఁ దడిసి
పంకిలమ్మైన జీవన ప్రాంగణమున
శాంతి దేవతాచరణ లాక్షారసారు
ణాంక లవలేశముల వెతుకాడుకొందు!''

''గొంతు విప్పక లోలోనఁ గుమిలి కుమిలి,
యెంత యేడ్చినఁ బగిలిపో దీ యెడంద;
అనుకొనిన యాశ లెప్పటికప్పు డెవియొ
కలయ ద్రిప్పును స్వప్న సాగర తటాల!''

''మృత్యు గర్జాఁ ప్రవాహ గంభీరమైన
విధి నిదురపోవు ప్రేమ జీవితములోన
సంఘటిలిన ప్రవాస దుస్స్వప్న వ్యథల
మడతలను సర్దుకొనుచుందు మాయకుండ!''

''తెగిపడిన పూలదండ లెత్తుగ నమర్చి,
అంధకారమ్ము సందిట నదుముకొనుచు,
నెవరికొఱకొ పదేపదే యెదురుచూచు
నా యెద కొనర్తుఁ గృత్రి మానందభిక్ష!''

''మొక్కినకొలందిఁ గాలితోఁ ద్రొక్కుచున్న
యీ కఠినలోకమెల్ల బహిష్కృతమ్ము;
రండు చిమ్మటలారా! ఈ రాత్రివేళ
నావలెనె పాడుకొను మీరె నాకు సఖులు!''

**వేదుల**

# అంధభిక్షువు

అతడు, రైలులో నేఁ బోయినప్పుడెల్ల
నెక్కడో ఒక్కచోటఁ దా నెక్కు-వాని
నతని కూతురు నడిపించు ననుసరించు;

అతడు దాశరథీ శతకాంతరస్థ
మైన యా పద్యమె పఠించు ననవరతము;

అతని యాగొంతు కట్లనే- అతడు పూర్వ
జన్మమందు నే నూతిలోననో చచ్చిపోవు
చెంత పిలిచిన వినువారేలేని లేక,

ఆ పిలుపు ప్రాణ కంఠ మధ్యముల యందు
సన్నవడి సన్నవడి నేటిజన్మ నతని
కనచు వెదకుచు వచ్చి చేరినది కాక-

అతని కన్ను లా బొత్తలే- ఆ సమయము
నందు తన్ను రక్షింప నేరైన వత్తు
రేమొ యని చూచి చూచి యట్లే నిలబడి
అతని ప్రాణాలు కనుగూళ్ళయందు నిలిచి
మరలఁ గనెఁగాక నేటి జన్మమున నతని!

అతని పాడినయంతసేపల్ల-నట్టి
యతని కన్నులు చూచినయప్పు డెల్ల,
నూతిలో మున్గు నాతని తీతు నంచు
వేగిరము పుట్టు నాదు హృద్వీథియందు!

అంతలో పాట నాపి, తా నచట నచట
కాను లడిగి, కూతురు ముందుగా, వినిర్గ
మించు నాతడు-

నే నందు మిగిలిపోదు!

విశ్వనాథ

# ఒకటే కథ

వెదకి వేసారి నా వెఱ్ఱిబ్రతు కెపుడేని
తుదిరేయి కనుమూయునా,
బేలనై
నిద్దుర బరువులఁ గ్రుంగునా!

మరపు మసకలదారి తెరచికొని కల యేదొ
విరిసికొని పరతెంచును

కాఱు రా
తిరికొసల మెఱపించును!

కలఁగి తొట్రిలుచు నాకలి తొందరల సోలు
కరము లట్టే చాతునో

నా ముందు
కనుల నట్టే తెరతునో!

అంతలో, నింతలో, నడుగుజాడయె లేక
వింత కల కరఁగి చనును,
నాకు నా
వంతకథయే మిగులును!

వనరు చేర్పఁగలేను, చచ్చి చావఁగలేను
కనలేని వెలుఁగు కొఱకై
ఎన్నడును
కనరాని దానికొఱకై!

ఒక క్రొత్త బరువుతో, ఒక క్రొత్త యాసతో
ఒకఁడనే పడిపోదును.
శూన్యమున
ఒకఁడనే కృశియింతును!

కృష్ణశాస్త్రి

# ఆవృత్తి

ఆ ప్రశాంతనిశాజఠరాంతమందు
కలంత నిదురలో కలల్ గాంచుచున్న
గౌతమీ నది నా మనోగత విషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె!

ఆ నదీసైకతముల నా యడుగుజాడ
చెరిపివేయగ వెనువెంట నరుగుదెంచు
గాలితరగల చల్లనికడుపులోన
కన్నుమూసెను నా యూర్పు గాడ్పులెల్ల!

చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగు [1]విషయంబులను తటస్థముగ నా య
నంత గగనమునందుండి యరయుచుండు
తారలె మదశ్రుకణముల నేరుకొనియె!

నేనె మిగిలితి నీ గౌతమీనదీ ప
విత్ర [2]గర్భంబులో మ్రోతపెట్టుచున్న
యుగయుగాంత విశ్వ మహోగ్ర దుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ!

వేదుల

1. విషయమ్ములను 2. గర్భమ్ము

# అవతారం

యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బు చాటున
ఖణేల్ మన్నాయి!

నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు త్రెంచుకు
ఉరికి పడ్డాయి!

ఉదయ సూర్యుని సప్త హయములు
నురుగులెత్తే
పరుగుపెట్టేయి!

కనకదుర్గా చండసింహం
జూలు దులిపి
ఆవులించింది!

ఇంద్రదేవుని మదపుటేనుగు
ఘీంకరిస్తూ....
సవాల్ చేసింది!

నందికేశుడు రంకవేస్తూ
గంగడోలును
కదిపి గెంతేడు!

ఆది సూకర వేదవేద్యుడు
ఘుర్ఘురిస్తూ
కోరసాచాడు!

పుడమితల్లికి పురిటినొప్పులు
క్రొత్త సృష్టిని
స్ఫురింపించాయి!

శ్రీశ్రీ

## ప్రవాసము

ఎన్ని యెన్ని నిశ్వాసము లెగసినవియొ
ఈ బ్రతుకె రూపుమాసిపోయినది గాని
ఇంత విశ్వమ్ములో జాలి నింతనీడ
ఒదవగాలేద యొక్క నిట్టూరుపునకు!

కంట కురిసిన కార్చిచ్చుమంట యేళ్ళ
కాలి నుసియై నశించె వాంఛా లవాలె,
ఏ రెరుంగుదురని ఏ యెడారిదార్ల
నింకెనో చుక్కతడి జాడయేని లేక!

కరుణ పట్టున కీ బిచ్చగాని చేయి
చాచికొనినాడ మృత్యు ఘోషమ్మె మరచి,
వట్టి బయలున నొక మోడు చెట్టువోలె
ఎత్తినది కర మెత్తినట్లే కృశించె!

కనులు రెండును బండి చక్రమ్ము లయ్యె
చనువు చూపున కెరుకనవ్వునకు వెదికి
ఎందులకొ వెర్రిమదివోలె నిపుడు తిరుగు
చూపులే లేక అజ్ఞాతశూన్యసీమ!

స్వాగతాశ్లేషమున విడజాలు నెదల
నల్ల ద్రావితి మున్ను దోసిళ్ళ కొలది
వలపుటాకలి స్రుక్కు నా బ్రతుకుమీద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడుచు!

ఆశయమ్ముల, ఆనందలేశముల, అ
లంతియాసల, జీవితమంత ఇట్లె
యేడ్చివైచితి, వినువారె యేరు లేక
యేడ్పు సందడి నాలోననే చొరంగ!

వడవడ వడంకిపోదు జీవనపు గొనల
నెన్నడే నాసకళ తలయెత్తెనేని,
ఉభయ సంధ్యాంచలముల నెదో వెలుంగు
కలుగ కలవరపోవు ఘూకమ్ము వోలె!

మింట వెలుగు చుక్కగన్న, మిణుగురన్న
నేను సహియింపలే, నవ్వి యిరులు చెరుచు!
నాకు ప్రాణమే మెఱపులే లేకయున్న
భాద్రపదమాసమున నమావాస్య రాత్రి!

రేయి కడుపున చీకటిచాయ వోలె;
తమసు టెడద దివాంధ గీతము విధాన,
ఘూక రావాన వలవంత రేక రీతి
నా విషాదమ్ములో దాగినాడ నేనె?!

కృష్ణశాస్త్రి

# ఏమొ

పొదుగు నొవ్వంగ బాధించు ముద్దులేఁగ
నొడలు నాకెడి గోసాధ్వి యో ర్పదెంతొ
బాధ సహుపరించినఁ గాని స్వాదువయిన
ప్రేమమాధుర్యము రుచింపదేమొ పుత్ర!

మాయపొరలు వీడిన సుకుమార శిశువు
నోరు దెఱచి యేడ్చెడిని యెందులకొ గాని,
అంపకపుఁ బెండ్లికూఁతుఁ గన్నారఁ జూచి
నిలుపలే దేమిటికిఁ దల్లి నిండు టేడ్పు!

పడకటిలుఁ జూచి యేడ్చు జవ్వని యొకర్తు,
చనిన దెసఁజూచి యేడ్చు జనని యొకర్తు
తన సొగసుఁ జూచి యేడ్చు సుందరి యొకర్తు,
ఏడుపుఁ బ్రియమ్ముగా వచియింపరేమొ!

రాయప్రోలు

# సుప్తాస్థికలు

అవి ధరాగర్భమున
మానవాస్థికాపరంపరలు!
సుప్త నిశ్శబ్దసంపుటములు,

అట నొకే దీర్ఘ యామిని!
ఆ నిశా శ్మశాన శయ్యకు
ప్రాతఃప్రసక్తిలేదు!

ఆ అగమ్య తమో రహస్యాంగణాన
తాండవించును
మృత్యుశైతల్య మొకటె!

అవి నితాంత హేమంత హృదంతరంత
రనుభవాళి
ఘనీభవించిన సమాధులు!

ఆ మనుష్యాస్థికలు
నిద్రలో మునింగి
సంచరించును భైరవస్వప్నవీథి!

అవి చలించును
తమ చర్మకవచ మెపుడొ
బ్రదికిన దినాల తలపోతల బరువుచేత!

నా కనుంగవ
కన్నీళులై కరంగు
అవి ఒనర్చెడు నీరవాహ్వాన మెరిగి!

ఇంత శోషిల్లనేలొ నా హృదయపుటము
వణుకు నేటికొ
నా అస్థిపంజరమ్ము!

శ్రీశ్రీ

## చలిపిడుగు

ప్రళయాంతాభీల నభో
దళన ఫెళ ఫెళారవముల
చలిపిడుగా గర్జింపకు!
నిలిచి నాదు మనవి వినుము!

బంగారపు బొమ్మ నాదు
మంగళప్రదమ్ము యొంటి
రుద్రభూమి గటికనేల
నిద్రించెడు నొడలు మరచి

చూపబోకు మచట నీ ప్ర
తాపమెల్ల పిడుగా! నా
కన్నతల్లి యడిలి లేచి
కక్కటిల్లి యేడ్వగలదు!

కడుపుమంట గనలి పొక్క
కన్నతండ్రి నైన నాదు
పలువరింత మాటలకును
నలుక బూనకయ్య మదిని!

ప్రళయాంతాభీల నభో
దళన ఘెళఘెళారవముల
చలిపిడుగా! గర్జింపకు,
నిలిచి నాదు మనవి వినుము!

బసవరాజు

## దురదృష్టము

చూచితి మెంతో దేశము
సుఖము, శాంతి దొరకునో యని
మునిగితి మెన్నో నదులను
మోక్షము చేపట్టెద మని

ఎక్కితి మెన్నో కొండల
నీశ్వరు దర్శింతా మని,
మ్రొక్కితి మెన్నో వేల్పుల
కొక్కపండు వర మిమ్మని

నోచితి మెన్నో నోములు
కాచి బ్రోచు నని పార్వతి;
కడకు దేవి దయచేతను
కంటిమి రత్నములు రెండు;

బతుకు కలంకారముగా
వాని దాచ చేతగాక
ఎచటనో పోగొట్టుకొంటి
మెంతటి దురదృష్టముననో?

సౌదామిని

## తల్లి

తల్లి, అసహాయవై నీవు ధరణిమీద
పడితి వెప్పుడు నాదు గర్భంబు చీల్చి
ప్రకృతియంతయు నూత్నశోభల వెలింగె,
ప్రాణనాథుడు నా నిజప్రాణ మయ్యె!

ఎప్పుడేడ్చితి వీవు నోరెత్తి, యెడద
తత్క్షణంబ కృపాక్షీరధార లుబికె,
చిన్ని న వ్వెప్డు నీ మూర్తి చిందులాడి
హృదయము కలంచె, ఎరిగితి ప్రేమబాధ!

చిగురు పెదవుల ముద్దులు చిల్క, నెపుడు
''తల్లి!'' యని పిల్చి న న్నీవు దరిసినావొ,
అపుడు శ్రుతమయ్యె సృష్టిరహస్య మెల్ల,
''తల్లి!'' యని మారు పిలి [illegible]

ఆత్మయేగాక నాదు దేహమ్ము కూడ
కొల్లగొట్టి మాధుర్యంపు కుప్పవగుచు
తల్లి నిశ్చింత నను వీడి తరలిపోతె
'తల్లి!' యను నాదు ఆర్తనాదమె మిగిల్చి!

నోరి

## మాతృ గీతములు

ఎవ్వఁడా క్రూరకర్మఠుఁ డెవఁడు, నీల
జలద నిర్ముక్త శైశిర శర్వ రీ ప్ర
శాంత మలవాటుపడిన నిశాంతమందు
అకట, నట్టింటిదీపమ్ము నార్పినాడు!

ఎవ్వఁడా విరసాత్మకుం డెవఁడు, సాంధ్య
రాగ మంజుల రేఖా విరాజమాన
మంగలాకాశ సీమాంత రంగమందు
కారుచీఁకట్ల రాసులు గ్రక్కినాఁడు!

ఎప్పుడా నిర్దయస్వాంతుఁ డెవఁడు నన్నుఁ
గంటక నిగూఢ విపిన మార్గముల, దల్లి
లేని బిడ్డను గావించి, మానసంపు
టాసలన్నియు నడుగంటఁ గోసినాఁడు!

**2**

నేను జడబుద్ధినై సుంత నీదు పూజ
కై వలయు వస్తువుల్ సమాయత్తపఱుప
మఱచితినయమ్మ, నాకిట్టి మఱువరాని
శిక్ష ఘటియింప నీ కెట్లు చేతులాడె?

ఎంతకాలమ్ము పట్టినదే, త్వదీయ
పూజకై ద్రవ్యసంతతుల్ ప్రోఁగుసేయు
టింకను సమాప్తిలేదు తల్లీ! యింకొక్క
వత్సరమ్మైన్మ నీ పోర్పుఁబట్టలేదు!

ఇంక నా జీవితమ్ము నీ స్మృతికిఁ జెక్క
బడిన యొక శాసనామ్మయి వరలు నటవె!
చిన్ని నీ విగ్రహము ప్రతిష్ఠితము నాదు
నంతరంగమ్ము నీకు దేవాలయమ్ము!

**3**

నీవు మడిగట్టుకొనిపోయినావు పండ్లు
పుష్పములు బట్టుకొని దేవపూజ కెటకొ;
నేను నీ కొంగుఁ బట్టుక నీదువెంటఁ
బోవుటకులేక కన్నీటిబొట్లు రాల్తు!

నీవు పోయిన దెచటనో దేవళంబు
లలిత పూజావిధాన సంలగ్న హృదయ
నా వినిశ్చల ధ్యాన సమాధియందు
మఱచిపోదువో యేమొ నా మాటఁ దల్లి!

నేను నీ కన్నబిడ్డను, నిశితమైన
నా కడుపుమంటఁ జల్లార్చు, లోకనాథ
పాదకంజమరిందమ్ము చేదు కడుగు
ప్రత్యహమ్మును నీ చనుఁ బా లొసంగి!

నాయని

# పుష్యపూర్ణిమ

పున్నమి యేగుదెంచె; పరిపూర్ణసుధాకరబింబ
మల్లదే వెన్న లలరారెడిన్ గగనసీమను
చెల్లని పండువెన్నెలల్ కన్నులపండువై కడల
గ్రమ్మె, సమస్తము మోదభోగ్యమై యున్నది
కాని, నా హృదయ మొక్కటె క్రాగెడి
దుఃఖవహ్నికిన్!

హ్లాద మొసంగుగాదె యఖిలావనికిం గడు
జ్యోత్స్న, యందులో మోదము మీరగా
భువనమోహనమై తనరారు పూర్ణిమన్!
నా దురదృష్టభారమున నైజమె పో
తలక్రిందు లౌటచే ఖేదము మేదురం బగుచు
కేవలమున్ హృదయంబు నేర్చెడిన్!

పుట్టిన దామె యో విమల పూర్ణిమ,
నీ హృదయంబునందు! చేపట్టిన దస్మదీయ
మృదుపాణిని మత్కరపల్లవంబునం దిట్టె
గతించిపోయె హృదయేశ్వరి దివ్య వయోవిలాస
మిప్పట్టున ఘోరమై మిగిలె ప్రావిణశోషక
దుఃఖ కేలియే!

ఆయమ యెట్టిదో యెఱుగ వక్కట,
యొక్కనిమేషమేనియుం బాయక నన్ను
ఛాయవలె, బాహుయుగమ్ము సమాశ్రయింపదే!
నీ యుదరంబునందున జనియించినదానిని
నీ కుమారికన్ న్యాయమె వీడి నీ విటులు
నాకు గనంబడ పుష్యపూర్ణిమా!

ఎంతయు సంతసించు హృదయేశ్వరి
పున్నమరాత్రులందు, మత్కాంత విలాస సంపద
నఖండితమై తనరారుచుండు నా స్వాంతము,
చూచుచుండగనె స్వప్నవిధంబున
మారిపోయెనే యంతయు భాగ్యదేవి కుపితారుణ
దారుణ వీక్షణంబునన్!

వచ్చుచునుండు ముందు
ననివార్య విధంబున పూర్ణిమా నిశల్,
ముచ్చటమీర లోకము ప్రమోదమునొందు
యథావిధంబుగన్, అచ్చపుమోదసారమగు
నామె గతించుటచేత చంద్రికల్ చిచ్చులమాడ్కి
నా హృదయసీమ దహించుచునుండునే కదా!

**శివశంకరశాస్త్రి**

## ప్రేమయాత్ర

కమలినీ ప్రేమ భిక్షాటనమున కపుడె
ప్రాకి వచ్చుచు నుండె దివాకరుండు;
హృదయమున వెల్గు ప్రేమచిహ్నిత సహస్ర
భావ భానువులలము నాశావధులను!

కమలినీ ప్రేమబంధము విదిర్చి
మఱల మఱల తమోంధబంధుర పిశాచ
నృత్యములు, కాల జీమూతనిబిడ మృత్యు
హాసములు, ఘోర లోకలోకాంచలములు....

యుగయుగమ్ములుగా తమమ్మొదిగి యొదిగి
తిగ్మరోచిస్సహస్రమూర్తిని గమించు
వాని ఛేదింప దశదిశావళుల దాటి
తన యనంత మహాజ్యోతి ధారవోయు!

**పెనుమరి**

## అశాంతి

కనికరములేని దుఃఖవేదనల సెగల
పొగల వెలిజిమ్ము వలపు టూర్పులభరమ్ము
మోసికొని నేనె నాలోన మూల్గుకొనుచు
గాలివోలె సమస్తావకాశములను
నెడతెఱిపిలేక తిరుగాడి బడలినాను!

దారుణపు జీవితంపు టెడారిలోన
తీరని పిపాస నే దారితెన్నులేక
నేనె నా దుఃఖ బాష్ప శోణిత లహరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను!

కడుపు గాల్చెడు మండుటాకటను రేగి,
కోర్కె లొండింటిని గ్రసించుకొనెడు కొలఁది
ఒడ లెరుంగక కాలమృత్యువును నేనె
కొంచెముగ కొంచెముగ కబళించినాను!

కాని, మ్రోడైన నా యెదలోని బరువు
దీర, నా బ్రతు కూపిరి దేరుకొనగ,
కనికరపుచూపు, చిరునవ్వు తునుకయైన,
కటిక కఱవయ్యె పాడులోకాన నాకు!

ఏ కడల మిన్నుమను చుక్కయేని లేని
యీ నభము క్రుంగి కూలిపోయెడి విధాన
కారుమబ్బులె కాదు, చీకటులె కాదు,
క్రమ్ముగొననిమ్ము, కరడులు గట్టనిమ్ము!

వలపు తీపి యెరుంగని వట్టిరాతి
గుండెలోకమ్ము నిప్పులు గురియనిమ్ము
హృదయ మున్నంతవరకు నా ప్రేమకాంక్ష
బ్రతికియున్నంతవర కేడ్చి బ్రతుకుచుందు!

ఏ వెలుగు నన్ను తనదరి కీడ్చుకొనునొ!
ఏ తలపు దారి సూపునో!

**వేదుల**

## ఉన్మత్తపథికుడు

నా వలెనె యాత డున్మత్తభావశాలి
ఆగికోలేడు రేగు నూహల నొకింత!
ఎట్టి నిశనే నదరిపోవు, నెగసిపడును!
ఎన్ని చుక్కలపాటు లెన్నెన్ని మెరపులు!

ఇంత చిరుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును;
మస్తక మ్మోమ్మరగా వంచి మన్ను మిన్ను,
వేయి కేలాడగ వ్రాసి వేసికొనుచు!

ఏ నెరుంగుదు, నావలెనే యతండు
పాటపదములకై నిత్యపథికు డయ్యె!
ఏ నెరుంగుదు, నావలెనే యతండు
ప్రతి పదమ్మున శీతల స్వాదు మధు తు
షారముల పార్శ్వముల విరజిల్లు చేగు!

కృష్ణశాస్త్రి

# ఆశాగానము

ఏ సడి లేక యీ ప్రకృతియెల్ల
గభీర నిశానిబద్ధమై నీ సుకుమార హస్తముల
నిద్దురవోయెడు మౌనవేళ, నీవే సరిజేసి
యీ శిథిల వీణను పాడుమటంచు నా పయిన్
ద్రోసెద వేల, తీగ తెగునో, శ్రుతి దప్పునో,
పల్కదో, ప్రభూ!

మావుల గుంపులందు మధుమాసములన్
వికసించు కోకిలారావమువోలె,
రాగమధురమ్మును వీణ నదింపజాల,
నన్ బోవగనిమ్ము, ప్రేమ రసపూర్ణిత విశ్వవిలీన గాన
మీవే వినిపింతువేని సుఖియించెద నే
నది యాలకించుచున్!

ఏ విధినైన పాడుమనియే వచియింతువయేని
ప్రేమమై నీవె రచించి నాకు గరుణించిన
వీ ప్రణయార్ద్రగీతికల్ గావున,
నా విశుష్కిత గళమ్మున నీ కరుణారసామృత
శ్రీవిభవమ్ము నింపి మధురింపుము,
నే శ్రుతిగల్పి పాడెదన్!

వేదుల

# స్వామి

స్వామి! పరిగాఢశర్వరీచ్ఛవి దరిద్ర
తానిధానము తేజోవిహీన మనవ
రత పరిస్రుత బాష్ప ధారా మిళితము,
నన్ను నీ వుండుమ న్నంగణంబు తండ్రి!

ఈ మహాంధకారంబున నెపుడొ యొక్క
సారి మెరిసితి, నానాడు సామి! నా కు
టీర మానంద వాయు ప్రచార శత స
హస్ర కుసుమ పరీమళ వ్యాప్తంబు!

దానితో సరి, మరల నాంధ్యమ్ము క్రమ్మె,
తొలి చివర లేని చీకటులును, నేను,
ఒక్క రొక రప్పళించుకొం చుండినాము,
నిన్ను, నీ నాటిమెఱుపు మన్నించుకొంచు!

విశ్వనాథ

# నటరాజ

అవధరింతువు ప్రతి దివ సాంతమందు
నిత్యనూతన తాండవ నృత్యకేళి
ఓయి నటరాజ తలలైన నూపలేక
భువనములు దుర్భ రానందమున నడంగ!

అప్పు డూహాంచలమ్ముల నతిశయించి
పొరలు నమృతరసంపు మాధురులలోన
గొట్టుకొనిపోవు, స్వామి నా క్షుద్రజీవి
తమ్ముగూడ, దారియె లేక తనివిపోక!

అంత నే వెర్రినై పోదునయ్య; నిన్ను
బోలి పాడబోవుదు; నిన్నుబోలి నాట్య
మాడబోవుదు లజ్జ బోనాడి; కాక
యింతదాహమ్ము దహియింప నెటులు మనుదు?

ఏ విధాన సౌందర్య రసైక జీవి
నిలువనేరుతు నిట నొక్క నిముసమేని
మామకీన జీవిత [1]శూన్యమార్గముల త్వ
దీయ పాద మంజీరముల్ మ్రోయకున్న!

ఆటతో పాటతో నేర్చినట్లు దేవ!
ఏనుకూడ నీవలె నటియింపనిమ్మ,
ఎడతెగనియాత్ర నెట్లొ సాధించువరకు!
ఎట్లొ నీ దర్శనమ్ము సాధించువరకు!

కృష్ణశాస్త్రి

1. శుష్క

## ఉత్కంఠ

అనుపమ ప్రణ యాతిథేయమ్ము తోడ
పారదెరచితి హృదయ కవాట మిపుడె
[1]నీ గృహమే నీవె కై సేయ నేగుదెమ్ము
మొయిలు చీకట్లు క్రమ్మకమున్నె నాథ!

వలపు లొలికెడు పూవులు వాడిపోయె,
కనుక పీఠిక హారతి కునుకుచుండె,
తమ్మిరేకుల సురటి పొంకమ్ము తొరగె,
ఒంటి నిక నెంతసే పిటు లోర్తు స్వామి!

[2]ఏమిదోషంబు దలచి న న్నీ వియోగ
శోకమున ముంచి బాధింపజూచె దీవు
చెప్పరాదొకొ, ఇటకు రా నొప్పవేని
వెదకికొనివత్తు నేనె నీ పదము జేర!
కలసి త్రోపులాడెడు కారు మొయిలు
రాయిడి మునింగి, భీకరమాయె రేయి,
దివ్యతేజస్వి, నీవరుదేర కునికి
అనదనై పడియుంటి శూన్యాలయమున!

వేదుల

1. మొయిలు నీడల చీకట్ల ముసురుకొనిన
   నా గృహము నీవె కై సేయ నేగుదెమ్ము
2. దోషమ్ము

# ఏకాంతసేవ

రజనీముఖంబున రాగంబు మెఱసెఁ
గలువ పుట్టింటిలోఁ గలకల విరిసె
దివ్యసౌధంబులో దీపాలు వెలిగె
గర్భాలయంబులో గంటలు మ్రోగె

ప్రాక్సతీమణి పట్టె బంగారుగొడుగు,
విశ్వసుందరి వీచె విరిచామరంబు,
భవదఖండానంద భవనాంగణమునఁ
బడిగాపు బడియుండెఁ బ్రకృతిగణంబు!
ఆఁకలైన నెఱుంగవైతి వేమయ్య!
ఆరగింపఁగ వేళయయ్యె రావయ్య!

**2**

విరిదండ మెడలోన వేయుటేకాని
కన్నార నీ మూర్తిఁ గాంచనేలేదు,
ప్రణమిల్లి యడుగులఁ బడుటయేకాని
చేతులారఁగ సేవజేయనేలేదు,

నినుఁ గాంచి ముగ్ధనై నిల్చుటేకాని
ప్రేమదీరఁగ బల్కరింపనేలేదు
ఏమేమొ మనసులో నెంచుటేకాని
తిన్నగా నా కోర్కెఁ దెలుపనేలేదు;

బోధంబులో సుప్తి పొడజూపఁబోలు
కనులలోఁ జూపులోఁ గావిరుల్ గ్రమ్మె;
శుభ్రాభ్రపదములో సుడి పుట్టఁబోలు
భక్తిలోఁ బూజలో భ్రాంతులు వొడమె;

నాదంబులోఁ గంపనము పుట్టఁబోలు
తలఁపులోఁ బూజలో దడబాటు గదిరె
వెలుఁగులోఁ జీఁకటి విరిసెఁ గాఁబోలు
మనసులోఁ దెలివిలోఁ మఱపులు దోఁచె!

ఆనందమందుటే యుపచార మనుచు,
నవశనై యుండుటే అపరాధ మనుచు,
మది నెంచి యారీతి మాయలు సేయ
భావ్యమై తోచెనే ప్రాణేశ నీకు!

**వేంకట పార్వతీశ్వరులు**

## ముక్తావళి

పూవులరోజులున్ గడిచిపోయె
విషాదహిమావృతాంధకారావిలమయ్యె
నీ ప్రకృతి యంతయు, ఆకులపాటు నొంది
పూదీవెలు నాదు లేయెడద తీరున మోడయిపోయె,
నాటి యాజ్ఞావిధి స్వామి, నా కిపుడు జ్ఞప్తికివచ్చి
భయమ్ము గొల్పెడిన్!

ఈ మధుమాసశోభ గతియింపక పూర్వమె పూలతోటలో
కోమలపుష్పముల్ వెదకికోసి యమర్చిన ప్రేమదామమున్
'నా మెడలోనె వేయు మనినా' వపు డొక్క సుమమ్మునైన
నా స్వామి భవత్పదార్పణము సల్పగలేనయితిన్ విమూఢతన్!

నావలె శుష్కజీవనమునన్ దురపిల్లెడు యీ పవిత్ర
గోదావరి పేదవడ్డ నినదమ్ములతో శ్రుతిగల్పి
ప్రేమరాగావహదుఃఖగీతు లిపుడల్లుచు గ్రుచ్చుచునుంటి
నొక్కముక్తావళినిన్ పవిత్రనయనాంబుకణోజ్జ్వల
మౌక్తికమ్ములన్!

ఈ సుకుమారమాల ధరియింపుము నీ హృదయమ్మునందె
స్వామీ! సుముఖమ్ములై పరిణమించు [1]పవిత్రవసంతమాస
సంధ్యా సమయాంతరమ్ముల రవంత భవన్మధురార్ద్ర
దీర్ఘ నిశ్వాసపరిమళానిలపు స్పర్శను ప్రేమ నను గ్రహించుచున్!

**వేదుల**

---

1. మనోజ్ఞ

# ఉపహారము

పొటమరించు మున్న పుణికితి నొక కొన్ని
కనటువాయనట్టి పసరు మొగ్గ,
లఱనగమ్ము విచ్చి యఱవిచ్చి, నెఱవిచ్చ
నట్టి పూలు పుణికి యందు, నిందు-

ఈ పువుదండ గ్రుత్తునని యెప్డు దొడంగితినొ,
అతిప్రయత్నాపచితమ్ము లా సుమము
లన్నియు విస్మృత యత్ర్పపంచ ధూళీ
పరమాణుకోటుల విలీనములై
పొడమాసి పోయెనో, చేపడె నేటి కీ సుమము,
చేకొని చేతుఁ బునఃప్రయత్నముల్!

ఒక్కొక్క సుమమ్మె యేర్చి, నీ కుపద సేయ
గుణముకొన నల్లనల్లన గ్రుచ్చుచుండ,
బూర్వ పూర్వ గ్రథితమైన పూలు రాలి
మొదలు కన్పించ దీ స్రజమ్మునకు నాథ!

పూలు రాలుగాక పొలివోక తుదమొదల్
నిలుచు సూత్రమైన నే గ్రహించి
పూలు రాలినట్టి మాలిక తెత్తునా,
సాక్షిగాఁగ నా ప్రయత్నములకు!

ఇంత తోట నాటియిచ్చి పోయిన మన్మ
ధాతి మన్మధునకు నకట, పుష్ప
శూన్య సూత్ర మెట్లు సూడిద గావించు
రసవిహీనులగు విరక్తు లటుల!

ప్రతితరువున్ బ్రతివ్రతతి పల్లవతోరణ
గట్టి, తోటలోఁ గుతుకము మీఱఁ బూసరులు
గ్రుచ్చి యిటుల్ నిను వేచియుండ,
నా యతనములెల్ల మాని బ్రతుకంతయు
మాలిక సేయుపొంటె, నే క్షితిరుహమైన గానయితి,
జెల్లరె, తీవయుఁ గాకపోయితిన్!

కన్నుల వెన్నెలైన నినుఁ గన్గొనగల్గి
సుధాప్రపూరమౌ తిన్నని నీ యెలుంగు విని,
లేపకు నే నినుఁ బల్కరించు భాగ్యోన్నతి
కల్గినాడయిన, నో ప్రియ, నీ యెద వ్రాలి
నీ గళమ్ము న్నవపుష్పమాలనయి
పూనకమానుదునా మనోభవా!

పింగళి-కాటూరి

# మనవి

చుక్కలు తిరిగే హిమాద్రిపై ఆ
వాసము చేసే గౌరీశా!
విన్నావయ్యా నా మన వొక్కటి
విన్నవించనా గౌరీశా!
త్వ చ్ఛిర గంగా శీకర సేచిత
పుణ్యభూమిలో పుట్టాను
త్వ త్పాదారుణ కమల మరందము
తనివితీరగా తాగాను!

సృష్టి మరుగునా తళుకు తళుక్కున
మెరిసే కాంతులు చూస్తుంటి
కాలము దాటి, దిక్కులు దాటి,
కదిలే తేజము కనుగొంటి!

కళ్ళు తెరవగా కానవచ్చినవి
కాలుసేతులకు సంకెళ్లు,
మాటలాడుటకు పెదవి విప్పగా
తాళము పడ్డది నా నోరు!

నీ పాదాలకు నిత్యసేవ నే
నెట్లు చేతునో సెలవిమ్మా!
నీ నామాంకిత దివ్య గీతములు
ఎట్లు పాడుదును సెలవిమ్మా!

యక్షులు పాడే హిమాద్రిమీద
కొలువుండే ఓ గౌరీశా!
విన్నావయ్యా నా మన విప్పుడు
పాలించెదవా గౌరీశా!

దీక్షితులు

# మెట్లు

మెట్లు, మెట్లు,
రాతిమెట్లు,
కారునల్ల
రాతిమెట్లు!

ఎగసి, ఎగసి,
ఏ సీమల
ఏ పథాల
చేర్చునవో,

మెట్లు, మెట్లు,
రాతిమెట్లు,
కారునల్ల
రాతిమెట్లు!

కోట్ల కోట్ల
గుణగణాల
అడుగులబడి
అరిగిపోయి,
అడుగులబడి
తరిగిపోయి,
అరిగిపోయి
తరిగిపోయి,

మెట్లు, మెట్లు,
రాతిమెట్లు,
కారునల్ల
రాతిమెట్లు!

చిన్న అడుగు
కన్నె అడుగు,
చిట్టి అడుగు
పొట్టి అడుగు,
కరకుపదం
కరగుపదం
రక్తపదం
భక్తపదం
పాపిపదం,
పరమపదం,
యుగయుగాల పదములతో
రకరకాల అడుగులతో,
అరిగి, అరిగి,
తరిగి, తరిగి.

మెట్లు, మెట్లు,
రాతిమెట్లు,
కారునల్ల
రాతిమెట్లు!

కడియా, లం
దెలు, గజ్జెలు.
వడివడి ము
వ్వలు, గొలుసులు,
గలగలమన
గణగణమన,
అంటి అంటి
పైపైనే
అంటి అంటి
ప్రవహించే
అడుగులు, అడుగులు,
అడుగులు....!

మెట్లు, మెట్లు,
రాతిమెట్లు,
కారునల్ల
రాతిమెట్లు!

ఎగసి, ఎగసి,
ఏ పథాల చేర్చునవో?
ఎగసి, ఎగసి
ఏ సీమల కూర్చునవో!
ఎగసి, ఎగసి,
ఏ దర్శన మిచ్చునవో!
ఎగసి, ఎగసి,
ఎగసి, ఎగసి,

మెట్లు, మెట్లు,
రాతిమెట్లు,
కారునల్ల
రాతిమెట్లు!

**బాపిరాజు**

# శివరాత్రి ప్రభ

కాలకంఠుని నాగసర్పము
కుబుస మూడ్చి పడగ బుస్సంది,
రెండు నాల్కలు
గండు మీసాలట్లు దూసింది
చెవులు మోసింది;
నాగసార మూదేది యెవరోయి,
రాగ మొలికించేది యెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!

నొసట గొసరిన మూడోకన్ను
నివురులూదిన కొలిమిఁ దెగడి
నెగడి ద్రిప్పింది,
పొగలు గప్పింది;

కమ్మ రయితే యినుము కరగ,
సోమ రయితే చలిని కాగ;
ఎవరు వచ్చేరోయ్?
ఎవరు మెచ్చేరోయ్?
కాఱునల్లని కాళరాత్రి!

అర్థభాగపు మహంకాళీ
కర్థమది కాలేదొ
ఏమో?

పునుకులా గలగలలు వింటూ
కునుకు గన్నాదొ?
నాథునీ వద్దనదు నాట్యము
నాథునీ కద్దనదు....
అరరే ఆడిపోతున్నాయ్!

వాడి ముమ్మొనవాలు,
హుంత భుక్,
అజ కపాలం
ఢక్క డుబడుక్
నాల్గుసేతుల నాడు లౌతున్నాయ్!
అశ్శరభ! శరభ!!

పందెమూ వేసేది యెవరోయి?
కుందనము గాసేది యెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!

చంద్రమకుటము,
జటాజూటము,

సాంద్రనీలపు జదల పాపట
సురిగిపోతున్నాయ్!

చక్కనీ మువ్వన్నె చర్మము
అక్కళించిన పొట్టపైని
అంటియుండీ అంటకున్నా దోయ్!

'ఆకలా' అని యనే దెవరు,
'సోకులా' అని యనే దెవరు,
కాఱునల్లని కాళరాత్రి!

మోకరింపులు గావు
అది మఱి
బూకరింపుల నిలువు గాదు;
ఆ కడకు బడు నొక్క యంజ
యీ కడకు బడు నొక్క యంజ

ఏకముగ జేయుచును
నడు మొక
రేఖగాఁ దా వంచి గొంచు
సందియం లే కెంచువా రెవరు,
చిందు అని తోతెంచు వారెవరు,
కాఱునల్లని కాళరాత్రి!

అహంకారము లేదు లోలో
మహోన్నటనము మొగము చాటదు
మహోదేవా యభయ మిడు మన
అభినయానకు హస్తమే లేదు!

రసభమునఁ దన ముందు వెనుకల
ప్రభల గలిపించు!

ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి,
కాఱునల్లని కాళరాత్రి!

**కవికొండల**

## పూజా ప్రసూనములు

రాలని పూలు కోసికొని రమ్మని పంపితి
నీవె యీ యుషఃకాలము నందు పెద్ద యొడిగట్టి
ననున్ పవమాన వీచికా జాలములందు నే
వలపుజాడల గట్టుచు వచ్చులోన
ఈ పూలవనమ్ము గుమ్మమును మూసిరి, పిల్చినపల్క రెవ్వరున్!

ఈ పథమందు వచ్చు జనులెల్ల
రెగాదిగ నన్నుజూచి లోలోపల నవ్వుచుండ
నెటులో నిలుచుంటిని వేగుచీకటిన్
మాపులు వడ్డ లేత పొగమంచు తెరల్ పులకించిపో
ఉషఃశ్రీపవనమ్ము లెక్కి విహరించెడు పూవులతావు లానుచున్!

ఆ రవికాంతి నీల జలదావళిపై బడ
చిత్ర వర్ణ శోభా రమణీయతల్ దివిని వ్రాలిన పోలిక
ఈ ప్రభాత గంభీర సుగంధ శీతల సమీరము
నా మెయి సోకినంత, విప్పారెను
నా విషణ్ణ హృదయాన
అపూర్వవిముగ్ధ భావముల్!

వేసవిరేల వేణు వనవీథుల యం దలసప్రచారముల్
చేసిన కమ్మతెమ్మెరల చిందులతో స్ఫురియించు
గాన విన్యాసమువోలె
మెలమెల్ల నా చెవి సోకెను
నీ నిరంతర వ్యాపిత విశ్వ ఘోషణ రహస్యము
దూరమునుండి పిల్వగన్!

కాలము వెళ్ళబుచ్చి విధికాళులపై తలమోపుకంటె
నే నేల స్వతంత్రధర్మము వహింపగరాదని తోట పెన్గడిన్
కేల స్పృశింప
వింటి నొక కేకను; "మౌలిక గ్రుచ్చనెంచు
ప్రేమాలసు లీ వనిం జొర ననర్హులు వారలకందవీ పువుల్!"

**వేదుల**

# వటపత్రశాయి

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!

కంటికంతా జలమయమ్మై
మింటివరకూ యేకరాశై
జంటదొరకని మహాప్రళయపు
టింటిలో వటపత్రడోలిక

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!

జగము లన్నీ కాలయోనిలో
మొగము లెరగక నిదురబోవగ
నగుమొగము గల ముద్దుబాలుడ
నగుచు జోలల[1] బాడుకొంటూ

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ?

**బసవరాజు**

1. బాడుకొంచూ

# నీ రథము

ఓ ప్రభూ! నీ రథమ్ము దీక్షాప్రణీత
విధుర వేగమ్ము పరువులు వెట్టుచుండె
నా శరీరమ్ము దాని క్రిందఁబడి నలిగి
నలిగిపోయినయది రక్తనదము లింకి;

దివ్య తేజోవిరాజ త్త్వదీయ రథము
ఈః గతుకు దేమి యనియైన నాగలేదు.
నా విరోధించిన హతాన్ని నాదమునకు
వెనుదిరిగియైన మఱి చూచుకొనగలేదు!

నాదు రక్తంబు నీ రథచోదకుండు
కడిగివేయును రేపు చక్రములనుండి
అచటి బహుజన రక్తచిహ్నముల యందు
నాది యిదని గుర్తేమి కన్పడును సామి?

**విశ్వనాథ**

# మహాప్రస్థానం

మరో ప్రపంచం,
మరో ప్రపంచం,
మరో ప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు
పదండి త్రోసుకు
పోదాం, పోదాం పైపైకి!

కదం త్రొక్కుతూ
పదం పాడుతూ,
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం,
వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం?

దారి పొడుగునా గుండె నెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు!
బాటలు నడచీ,
పేటలు కడచీ,
కోటలన్నిటిని దాటండి!
నదీ నదాలూ,
అడవులు, కొండలు,
ఎడారులా మన కడ్డంకి?

పదండి ముందుకు,
పదండి త్రోసుకు
పోదాం, పోదాం పైపైకి!
ఎముకలు క్రుళ్ళిన,
వయస్సు మళ్ళిన,
సోమరులారా, చావండి!

నెత్తురు మండే,
శక్తులు నిండే
సైనికులారా, రారండి!

''హరోం హరోం'' హర!
హర హర! హర హర!
హరోంహరా'' అని కదలండి!

మరో ప్రపంచం,
మహా ప్రపంచం,
ధరిత్రి నిండా నిండింది!

పదండి ముందుకు,
పదండి త్రోసుకు
ప్రభంజనం వలె హోరెత్తండీ!
భావ వేగమున ప్రసరించండీ!
వర్షుకాభ్రముల ప్రళయ ఘోషవలె
ఫెళ ఫెళ ఫెళ ఫెళ విరుచుకు పడండి!!

పదండి,
పదండి,
పదండి ముందుకు!

కనబడలేదా మరో ప్రపంచపు
కణకణ మండే త్రేతాగ్ని?
ఎగిరి ఎగిరి ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు!
తిరిగి తిరిగి తిరిగి సముద్రాల్
జల ప్రళయ నాట్యం చేస్తున్నవి;
సల సల క్రాగే చమురా? కాదిది,
ఉష్ణరక్త కాసారం!
శివసముద్రమూ,
నయాగరావలె
ఉరకండీ, ఉరకండీ ముందుకు!
పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
మరో ప్రపంచపు కంచునగారా
విరామ మెరుగక మ్రోగింది!

త్రాచులవలెనూ,
రేచులవలెనూ,
ధనంజయునిలా సాగండి!

కనబడలేదా మరో ప్రపంచపు
అగ్ని కిరీటపు ధగధగలు
ఎర్రబావుటా నిగనిగలు
హోమజ్వాలల భుగభుగలు!!

  

# గురజాడ అప్పారావు



విశాఖ జిల్లా యలమంచి తాలూకా రాయవరంలో 1862 సెప్టెంబర్ 21వ తేదీన జననం. సంస్కృతం, ఇంగ్లీషు భాషల్లో మంచి ప్రవేశం ఉన్నది. 1872లో విజయనగరం ఉన్నత పాఠశాలలో ప్రవేశించారు. అక్కడ గిడుగు రామమూర్తిగారి సహాధ్యాయులు. మెట్రిక్యులేషన్‌లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేశారు. 1886లో బి.ఏ. ప్రథమ శ్రేణిలో కృతార్థులయ్యారు. 1887లో విజయనగరం మహారాజు కళాశాలలో నాల్గవ తరగతి ఉపన్యాసకులుగా నియమించారు. 1891లో మూడవ లెక్చరర్‌గా పనిచేశారు. 1896లో సంస్థాన శాసన పరిశోధకులుగా నియమింపబడ్డారు. కొద్దికాలం మహారాజుకు అంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. 1897 నాటికే కన్యాశుల్కం రచించారు. ఆ సంవత్సరమే మహారాజు చనిపోవడంతో, వారి సోదరి, రీవా మహారాణికి అంతరంగిక కార్యదర్శిగా నియమితులయ్యారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు భాషకు పరీక్షాధికారులుగా పనిచేశారు. 1915 నవంబరు 30న మరణించారు.

# రాయప్రోలు సుబ్బారావు



గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా గార్లపాడులో 13.3.1892లో జన్మించారు. బాపట్ల హైస్కూలులోను, నైజాం కాలేజీలోను చదువుకున్నారు. శాంతినికేతనంలో రవీంద్రనాథ్ సన్నిధిని ఉన్నారు. బెంగాలీ, హిందీ చదివారు. ఉస్మానియా యూనివర్సిటీలో 1921 నుండి 1949 వరకు పనిచేశారు. 1956-59 వరకు శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలో హెడ్ ఆఫ్ ది తెలుగు డిపార్టు మెంటుగా పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రారంభం నుండీ 1968 వరకు కార్య నిర్వాహక సభ్యులు; విశిష్ట సభ్యులు. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారితోపాటు నవ్య సాహిత్య పరిషత్తుకు సంయుక్త అధ్యక్షులుగా పనిచేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం వీరికి డాక్టరేటు ఇచ్చింది. 1984 జూన్ 30న మరణించారు.

## నండూరి సుబ్బారావు



కృష్ణా జిల్లా నూజివీడు తాలూకా పల్లెర్లమూడిలో 1895 జనవరి 26న జన్మించారు. మద్రాసు క్రిష్టియన్ కాలేజీలో బి.ఏ. ప్యాసయ్యారు. 1919లో యఫ్.యల్. పూర్తయిన తరువాత నూజివీడు హైస్కూలులో పనిచేశారు. 1925లో బి.యల్. పూర్తిచేసి ఏలూరులో ప్రాక్టీసు చేశారు. 1917,1918 లలో కవితలల్లడం ప్రారంభించారు. 'యెంకి పాటలు' 1925లో ప్రచురించారు. 1957 మే 29న మరణించారు.

## తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి



గుంటూరు జిల్లా కాజ గ్రామంలో 12.9.1892లో జననం. మెట్రిక్యులేషన్ చదివారు. తర్వాత వ్యాకరణం, తర్క వేదాంత శాస్త్రాలు, పాశ్చాత్య తత్వశాస్త్రం, చిత్ర శిల్పశాస్త్ర చరిత్రలు అధ్యయనం చేశారు. సంస్కృతం, పాలీ, హిందీ, వంగ, కన్నడం, ఉర్దూ, పారసి, లాటిన్ భాషలలో కృషి చేశారు. సాహితీ సమితి, నవ్య సాహితీ సమితి మున్నగు సాహిత్య సంస్థలకు అధ్యక్షులు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు (1964-68), విశిష్ట సభ్యులు. న్యూఢిల్లీ అకాడమీ తెలుగు భాషా సమితిలో సలహాదారు. 1979లో మరణించారు.

## చింతా దీక్షితులు



తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా దంగేరు గ్రామంలో 1891లో జననం. రాజమహేంద్రవరంలో బి.ఏ., చెన్నపట్టణములో యల్.టి. పూర్తి చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో అనేక ప్రాంతాలలో డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా పనిచేశారు. 1960 లో మరణించారు.

## విశ్వనాథ సత్యనారాయణ



కృష్ణాజిల్లా నందమూరులో 10.9.1895లో జన్మించారు. బందరు నోబుల్ కాలేజీలో బి.ఏ. పాసయ్యారు. అయిదు సంవత్సరాలు బందరు హిందూ కాలేజీలో, గుంటూరు ఆంధ్ర క్రిష్టియన్ కాలేజీలో రెండు సంవత్సరాలూ, పిమ్మట 1938 మొదలు 59 వరకు విజయవాడ యస్.ఆర్.ఆర్., సి.వి.ఆర్ కాలేజీ లోనూ తెలుగు పండితులు. 1959 నుంచి 1961 వరకు కరీంనగర్ కాలేజి ప్రిన్సిపాల్, సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యులు, విశిష్ట సభ్యులు. జ్ఞానపీఠం అనే సంస్థ ఈయనను ఉత్తమ రచయితగా ఎన్నుకొని లక్షరూపాయల బహుమతిని 1971లో ఇచ్చింది. ఆంధ్ర ప్రభుత్వం ఈయనను ఆస్థానకవిగా 1971లో నియమించింది. 1976లో మరణించారు.

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

తూర్పు గోదావరి జిల్లా, పెద్దాపురం తాలూకా చంద్రంపాలెంగ్రామంలో 1897లో జననం. 1918లో విజయనగరం కళాశాలలో పట్టభద్రు లయ్యారు. అదే సంవత్సరంలో హరిజనులతో పంక్తి భోజనంవల్ల కులం నుంచి వెలి అయ్యారు. పెద్దాపురం, పిఠాపురం, కాకినాడ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులు. 1941లో ఉద్యోగ విరమణ. 1942లో నవసాహిత్య పరిషత్తుకు, 1946లో అభ్యుదయ రచయితల మహాసభకు అధ్యక్షులు, మల్లీశ్వరి చిత్రానికి మాటలూ, పాటలూ వ్రాశారు. ఇంకా అనేక చిత్రాలకు పాటలు వ్రాశారు. ఆంధ్ర సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యులు. 1980లో మరణించారు.



## శ్రీశ్రీ

విశాఖపట్టణంలో 2.1.1910న జననం. మిసెస్ ఎ.వి.యన్. కాలేజీలో ఇంటర్మీడియేట్, తర్వాత మద్రాసు క్రిష్టియన్ కాలేజీలో బి.ఏ. పాసయ్యారు. విశాఖపట్టణం హార్బర్‌లో కొంతకాలం, ఆంధ్రప్రభలో కొంతకాలం, ఢిల్లీ ఆలిండియా



రేడియోలో తెలుగు వార్తల ఎనౌన్సర్‌గా కొంతకాలం, ఇండియన్ ఆర్మీకోర్‌లో కొంతకాలం పనిచేశారు. సినిమాలకు మాటలు, పాటలు వ్రాశారు. 1954లో మాస్కో యాత్ర, 1959లో స్టాక్‌హోం ప్రపంచశాంతి మహాసభకు ప్రతినిధిగా వెళ్ళారు. 1966లో సోవియట్ లాండ్ నెహ్రూ బహుమతిని పురస్కరించుకొని సోవియట్ యూనియన్ వెళ్ళారు. కొంతకాలం ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ అధ్యక్షులు. 1970లో విప్లవ రచయితల సంఘంలో చేరారు. 1983లో మరణించారు.

## ఓలేటి పార్వతీశము



తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం తాలూకా కొమరగిరి పట్టణంలో 1882లో జననం. ఆంధ్ర ప్రచారణీ గ్రంథమాల సంస్థాపకులు. వంగభాషలో పాండిత్యం. బాలాంత్రపు వెంకట్రావుగారితో కలిసి కవిత చెప్పి వెంకటపార్వతీశ్వర కవులుగా ప్రసిద్ధి కెక్కారు. స్వతంత్ర రచనలేగాక వంగభాష నుంచి అనేక నవలలు అనువదించారు. 1955లో మరణించారు.

## బాలాంత్రపు వెంకట్రావు



తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురం తాలూకా మల్లాం గ్రామంలో 1881లో జననం. ఓలేటి పార్వతీశంగారూ, వీరూ ఆంధ్ర ప్రచారణీ గ్రంథమాల నిర్వహించారు. స్వతంత్ర రచనలు, వంగభాష నుంచి అనువాదాలు చేశారు. ఓలేటి పార్వతీశంగారితో కలిసి వెంకటపార్వతీశ్వర కవులుగా ప్రసిద్ధి కెక్కారు. 1972లో మరణించారు.

## కొడాలి ఆంజనేయులు



కృష్ణాజిల్లా దివి తాలూకా కొడాలి గ్రామంలో 1897 జూలై 1న జననం. 1924లో రెవిన్యూశాఖలో ఉద్యోగం చేస్తూ రాజీనామా ఇచ్చి, సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. 1930, 32,41 సంవత్సరాలలో మొత్తం నాల్గేళ్ళు జైలుశిక్ష అనుభవించారు. 1942 నుండి రెండున్నర సంవత్సరాలు డిటెన్యూగా ఉన్నారు. కాంగ్రెస్‌లో అనేక పదవులు నిర్వహించారు. డాక్టర్ పట్టాభిగారు రాసిన కాంగ్రెస్ చరిత్రకూ, గాంధీ అండ్ గాంధిజం అనే గ్రంథానికి అనువాదకులు. ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక సంఘం స్టేట్ బోర్డులో ఉపాధ్యక్షులు. 1982 లో మరణించారు.

## నోరి నరసింహశాస్త్రి



గుంటూరులో 6.2.1910న జననం. 1925లో మద్రాసు యూనివర్సిటీలో బి.యల్. పాసయ్యారు. 1927 వరకు గుంటూరులోను, తర్వాత రేపల్లెలోను ప్రాక్టీసు చేశారు. 1961 నుంచి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు.

## పింగళి లక్ష్మీకాంతం



బందరు తాలూకా, ఆర్తమూరులో 10.1.1894న జననం. బందరు నోబుల్‌కాలేజీలో బి.ఏ. చదివారు. మద్రాసు యూనివర్సిటీలో పోస్టు గ్రాడ్యుయేట్ ఎం.ఏ.పాసయ్యారు. ఇంగ్లీషు, సంస్కృతాలలో పండితులు. ఈ క్రింది పదవులను నిర్వహించారు.

1. సీనియర్ తెలుగు పండిట్ అండ్ లెక్చరర్ ఇన్ తెలుగు. నోబుల్ కాలేజి, మచిలీపట్టణం.

2. ఫెలో ఆఫ్ ది ఓరియంటల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్, యూనివర్సిటీ ఆఫ్ మద్రాసు.
3. హెడ్ ఆఫ్ ది తెలుగు డిపార్టుమెంటు, ఆంధ్ర యూనివర్సిటీ.
4. లిటరరీ అడ్వైజర్. ఎ.ఐ.ఆర్.
5. ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు అండ్ ది డీన్ ఆఫ్ ది ఫేకల్టీస్ ఆఫ్ ఓరియంటల్ లెర్నింగ్, శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ.
6. మెంబర్ జనరల్ కౌన్సిల్ అండ్ ఎగ్జిక్యూటివ్ బోర్డు ఆఫ్ ది నేషనల్ అకాడమీ ఆఫ్ లెటర్స్, ఢిల్లీ, మెంబర్, బోర్డు ఆఫ్ గవర్నర్స్, తెలుగు అకాడమీ, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్. 1972 లో మరణించారు.

## కాటూరి వెంకటేశ్వరరావు



కృష్ణాజిల్లా కాటూరులో 15.10.1895లో జన్మించారు. బందరు హిందూ హైస్కూలులో మెట్రిక్యులేషన్ పాసయ్యారు. బందరు నోబుల్ కాలేజీలో బి.ఏ. చదువుతూ అసహాయోద్యమంలో చేరారు. 1930లో రెండున్నర సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించారు. బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో 1934లో వైస్ ప్రిన్సిపాల్‌గా చేరి 1939లో ప్రిన్సిపాల్ అయ్యారు. ఆంధ్ర హిందీ ప్రచార సభలకు తెలుగు సలహాదారుగా పనిచేశారు. ఢిల్లీ సాహిత్య అకాడమీకి ''కావ్యమాల'' సమకూర్చారు. 1944 డిసెంబర్‌లో నవ్యసాహిత్య పరిషత్తు సభకు అధ్యక్షత వహించారు. 1962 లో మరణించారు.

## కవికొండల వెంకటరావు



తూర్పు గోదావరి జిల్లా శ్రీరంగపట్నంలో 20.7.1898లో జన్మించారు. మద్రాసు యూనివర్సిటీలో బి.యల్. పూర్తిచేసి, రాజమండ్రిలో ప్రాక్టీసు చేశారు. 4.7.1964 లో మరణించారు.

## బసవరాజు వెంకట అప్పారావు



విజయవాడ సమీపంలో పటమట గ్రామంలో 13.12.1894లో జననం. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో బి.ఏ. పాసైనారు. 1916లో రాజ్యలక్ష్మమ్మను (సౌదామిని) వివాహం చేసుకున్నారు. గాంధీ ఉద్యమంతో సంబంధం పెట్టుకుని జాతీయగీతాలు రాశారు. 1921 ప్రాంతంలో ఆంధ్రపత్రిక, భారతికి సహాయ సంపాదకులుగా పనిచేశారు. 1925లో బి.ఎల్. పాసైనారు. 1927లో విజయవాడలో ప్రాక్టీసు పెట్టారు. భారతదేశంలో కళాక్షేత్రాలు దర్శించడం ఒక సరదా. తాజ్‌మహల్ దర్శించినప్పుడే, ''మామిడిచెట్టును అల్లుకొన్నదీ మాధవీలతొకటి'' అనే పాట రాశారు. 1933లో మరణించారు.

## సౌదామిని
### (బసవరాజు రాజ్యలక్ష్మి)

విజయవాడవద్ద పటమటలో 1904లో జన్మించారు. బసవరాజు అప్పారావుగారి సతీమణి. గుంటూరు శారదానికేతన్‌లో 14 ఏండ్లు మేనేజర్‌గా పనిచేశారు. వార్ధా మహిళాశ్రమంలో మహాత్ముని వద్ద మూడేండ్లు శిక్షణ పొంది వ్యష్టిసత్యాగ్రహంలో జైలుకు వెళ్ళారు. మద్రాసు దక్షిణ హిందీ ప్రచారసభలో మహిళా విశ్వవిద్యాలయం వార్డెన్‌గా వుండి హిందీ ప్రచారం చేశారు. అరవం, కన్నడం, గుజరాతీ, హిందీ, బెంగాలీ, మహారాష్ట్రం మొదలైన భాషల్లో బాగా పరిచయం ఉన్నది.

## వేదుల సత్యనారాయణశాస్త్రి



భద్రాచలం వద్ద గొల్లగూడెంలో 22.3.1900న జననం. భద్రాచలంలో కొట్టుకుళ్ళ శ్రీనివాసాచార్లు వద్ద సంస్కృత కావ్యాలు, చిలుకూరి సోమనాథశాస్త్రి వద్ద సంస్కృత వ్యాకరణం చదివారు. కవితా గురువు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి వద్ద చాలాకాలం శిష్యరికం చేశారు. గుంటూరు ఎ.సి.కాలేజి హైస్కూలులోను, యు.ఎల్.సి.యం. హైస్కూలు, పెద్దాపురంలోను, పేరూరు హైస్కూలులోనూ, రామచంద్రపురం హైస్కూలు

లోను, సామర్లకోట హైస్కూలులోను తెలుగు పండితులుగా పనిచేసి, కావలి నెహ్రూ కాలేజి (ఇప్పటి జవహర్ భారతి) లో తెలుగు లెక్చరర్‌గా పనిచేసి రిటైరయ్యారు. 7.1.1976 లో మరణించారు.

## తల్లాప్రగడ విశ్వసుందరమ్మ

పశ్చిమగోదావరి జిల్లా ఉండి గ్రామంలో 6.3.1899న జన్మించారు. భర్త నరసింహశర్మగారితోపాటు బ్రహ్మసమాజంలో సంఘసంస్కరణోద్యమంలో పనిచేశారు. 1921 నుంచి భర్తతోపాటు కాంగ్రెస్‌లో ప్రచారం చేశారు. 1930 జాతీయోద్యమంలో జైలుకు వెళ్ళారు. చాగల్లు గ్రామంలో ఆనందనికేతనం అనే ఆశ్రమం భర్తతో కలిసి స్థాపించి అస్పృశ్యతా నివారణకు కృషి చేశారు. 1949 ఆగష్టు 30న మరణించారు.



## అబ్బూరి రామకృష్ణరావు

జననం 20.5.1896. మైసూరు మహారాజా సంస్కృత కాలేజీలోనూ, కలకత్తా సిటీకాలేజీలోనూ చదువుకున్నారు. బి.ఏ., యఫ్.ఎల్.ఏ. పాసయ్యారు. బెంగాలీ, కన్నడ, హిందీ, సంస్కృతం, ఇంగ్లీషు భాషల్లో పాండిత్యం ఉంది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో లెక్చరర్‌గాను, చీఫ్ లైబ్రేరియన్‌గాను పనిచేశారు. 1978 లో చనిపోయారు.

## దువ్వూరి రామిరెడ్డి



నెల్లూరు జిల్లా గూడూరులో 5.12.1895లో జన్మించారు. స్కూలు చదువు చాలా కొద్ది. చిత్రలేఖనం, శిల్పాలు తయారుచేయడం సరదా. స్వయంకృషితో ఇంగ్లీషూ, ఫ్రెంచి, బెంగాలీ, సంస్కృతం, జర్మన్, పర్షియన్, ఉరుదూ, తమిళ భాషల్లో పాండిత్యం సంపాదించారు. చిత్రనళీయం సినిమా డైరెక్టు చేశారు. 1947 సెప్టెంబర్ 11న మరణించారు.

## అడివి బాపిరాజు



భీమవరంలో 1895 అక్టోబర్ 8న జననం. 1922లో రాజమహేంద్రవరంలో బి.ఏ. పూర్తి చేశారు. సత్యాగ్రహోద్యమంలో జైలుకు వెళ్ళారు. విడుదలైన తర్వాత, బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో ప్రమోదకుమార ఛటోపాధ్యాయ వద్ద చిత్రలేఖనం నేర్చుకున్నారు. తర్వాత మద్రాసులో బి.యల్. పూర్తిచేసి, నాల్గు సంవత్సరాలు భీమవరంలో ప్రాక్టీసు పెట్టారు.

1934లో బందరు ఆంధ్ర జాతీయ కళాశాల ప్రధాన అధ్యాపకులుగా పనిచేశారు. 1930లో అనసూయ-ధృవ, మీరాబాయి చిత్రాలకు కళాదర్శకత్వం వహించారు. 1944లో మీజాన్ (హైద్రాబాద్) పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. తర్వాత మద్రాసు ప్రభుత్వం పంపగా సింహళంలోని బౌద్ధశిధిలాల ప్రతిరూపాలను చిత్రించడానికి సింహళం వెళ్ళారు. 1952 లో చనిపోయారు.

## నాయని సుబ్బారావు



నెల్లూరు జిల్లా పొదిలి గ్రామంలో 29.10.1899లో జన్మించారు. మచిలీపట్టణం నోబుల్ కాలేజిలో బి.ఏ. చదువుతూ 1924 అసహాయోద్యమంలో చదువు మానుకొన్నారు. తర్వాత రాజమహేంద్రవరం ట్రైనింగ్ కాలేజీలో బి.ఇడి. పాసయ్యారు. నర్సరావుపేట హైస్కూలులో హెడ్మాష్టరుగా పనిచేసి రిటైరయ్యారు. ఆంధ్రప్రదేశ్ ప్రథమ అకాడమీ సభ్యులు. 1978 లో చనిపోయారు.



పశ్చిమగోదావరి జిల్లా ఉండిలో 15.6.1906లో జన్మించారు. కాకినాడ సి.ఆర్.కాలేజీలో యస్.యస్.యల్.సి వరకు చదివి, తర్వాత శాంతినికేతనంలో విశ్వభారతిలో చదివారు. 1932 సత్యాగ్రహోద్యమంలో జైలుకు వెళ్ళారు. 1920లో త్రివేణి పత్రికకు సహాయ సంపాదకులుగానూ, 1938లో ఆంధ్రప్రభ సహాయ సంపాదకుడుగానూ పనిచేశారు. 1986 లో చనిపోయారు.



# అబ్బూరి రామకృష్ణరావు

పదగుంభన ఈయన ప్రత్యేక ప్రతిభ. గీతాలలో గొప్ప హొందా గోచరిస్తుంది. ఉత్తమ సంస్కృత కావ్యాలలోని పూర్ణతా, గౌరవమూ, గాంభీర్యమూ ఈయన పద్యాలలో ప్రతిబింబిస్తవి. నన్నయ్యనాటి అక్కరలకు మార్పులు తెచ్చి కొత్తనడకలు నడిపించడమే కాకుండా, స్వకపోల కల్పితాలైన నూతన ఛందస్సులు కూడా కల్పించాడు. ఈయన పద్యాలలో ఒక్క పలుకుపట్టి చూసినా ఉత్తమ సంస్కారి అని తెలుస్తుంది.

జననం: 1896, మరణం: 1978

కృతులు: 1. ఊహాగానము - పూర్వప్రేమ 2. మల్లికాంబ 3.నదీ సుందరి.

# కవికొండల వెంకటరావు

ఆంగ్ల కవి ప్రపంచంలో 'వర్డ్స్‌వర్త్' వలె అడుగడుగునా ప్రకృతి ఉపాసకుడు. ఆలుచిప్ప మొదలు శివరాత్రి ప్రభ వరకూ సృష్టిలో సమస్తమూ ఈయనకు ఏదో ఒక కొత్త ఊహను స్ఫురింపజేస్తుంది. రచనలలోనూ, ఊహలలోనూ వైవిధ్యము ఎక్కువ. భాష పట్టింపులేదు. భావాన్నిబట్టి, మానసికస్థితిని బట్టి పద్యం ఇష్టం వచ్చినట్లు స్వతంత్రించి పరుగెడుతుంది. ఏ వస్తువైనా ఈయనకు అమిత ఉత్సాహాన్నీ, ఆవేశాన్నీ కలిగిస్తుంది. ఊహలలో మిక్కిలి ప్రత్యేకత గలవాడు. మొత్తంమీద భావంలో వినూత్నత, విధానంలో అతి స్వతంత్రత గల సాహసుడు.

జననం: 1892, మరణం: 1969

కృతులు: 1. నెలబాలుడు 2. ప్రకృతి చందనము 3. మాతృదేశ సంకీర్తన

4. జనపదములు 5. విలాసినీవైనతేయము 6. వివిధ కుసుమావళి.

# దేవులపల్లి కృష్ణశాస్త్రి

శిల్పి, గాయకుడు - కవిత్వంలో కూడా - సన్నపోగారు చెక్కడంలో మహా నిపుణుడు. 'కీట్స్' 'షెల్లీ'ల పదాల కూర్పు ఆంగ్ల కవిత్వానికి ఎటువంటి నూతన శోభను కూర్చిందో తెనుగు కవిత్వభాషకు ఈయన కృషి అటువంటిది. ఊహాతీతమైన దేనికో అఱ్రులుచాచే ఆశాజీవి. ఆశయాలలో, అనుభవాలలో కొత్తదనమూ, విశేష ప్రత్యేకతా ఉన్నవాడు. ప్రేమకై విరహం పొందాడు; విరహంలో వేగిపోయాడు; ఈ అనుభవాలను శాశ్వత శిల్పాలుగా నిర్మించాడు. దుఃఖించాడు ప్రేయసి మరణానికి; కాని దుఃఖం మారింది. అవ్యక్త వేదనగా; చివరకు దుఃఖాన్నే వరించ మొదలుపెట్టాడు. ప్రేమించాడు వ్యక్తులనేమో, కాని, ప్రేమ తెరిచిన గవాక్షాల గుండా హృదయం పరుగువారింది. వింత మిణుగురులకు తళుకు మెరుపులకు; విడని ఒక వేదనతో, దొరకని ఒక తేజస్సుకై పాటలలో ఈయనను దరిజేరగలవారు లేరు. బ్రాహ్మమతం కల్పించిన స్వేచ్ఛ పక్షబలాన్ని కూర్చినా అంతకు

యెక్కువైన స్వేచ్ఛకై పక్షాలను కదిపాడు. వైష్ణవ గీతాలలోని హృదయ పక్వత మెదడునకు పట్టించుకున్నాడు. కళాసంపత్తి ఎక్కువ. కవిత్వం కోసం బ్రతుకుతాడు. రుచిగలవాడు.

జననం: 1897, మరణం: 1980

కృతులు: 1. కృష్ణపక్షం 2. ప్రవాసము-ఊర్వశి 3. కన్నీరు 4. శ్రావణి 5. కార్తీక 6. మహతి.

## కొడాలి ఆంజనేయులు

నాజూకుగా ఊహిస్తాడు. మృదువైన పదాల పొందికతో జాగ్రత్తగా వ్యక్తపరుస్తాడు భావాన్ని. ఈయన 'పెండ్లికూతురు'లో కట్టిన బొమ్మలు తెలుగువారి కన్నులకు చిరపరిచితాలు, అయినప్పటికీ ఈయన చెప్పిన విధానాన్నిబట్టి ఎక్కువ రుచివంతాలు అయినవి. శైలిలో ఒక చక్కదనం ఈయన ప్రత్యేకత.

జననం: 1898, మరణం: 1982

## గురజాడ అప్పారావు

వైతాళికులనే మేలుకొలిపినవాడు. మార్గదర్శి, మేధావి. ఈయన గీతాలలో గౌరవాశయాలు, నూతనస్వచ్ఛత. స్వేచ్ఛ ప్రత్యేకత ఉన్నవి. కవిత్వాన్ని కళగా గ్రహించకపోలేదు; కాని, సంఘసంస్కారానికి కొంత సాధనగా ఉపయోగించాడు. కవిత్వాన్ని తన ఆశయాలను నచ్చచెప్పటానికి వినియోగించాడు. చక్కని వాడుక భాషను ప్రవేశ పెట్టి సులభ శైలిని పదాలు పాడి, ముత్యాలసరము కూర్చి, భాషకు నూతనాలంకారాలను కల్పించాడు. కవిత్వం పండితుల ప్రత్యేకనిధి కాకుండా అందరికీ పంచిపెట్టే మార్గాన్ని నిరూపించాడు. ముందు రాగలవారికి 'స్వేచ్ఛా పత్రం' (మేగ్నాకార్టా) సంపాదించాడు.

జననం: 1862, మరణం: 1915

కృతులు: 1. ముత్యాల సరములు - చిన్నకథలు 2. నీలగిరి పాటలు 3. సుభద్రా పరిణయం 4. కన్యాశుల్కం 5. కొండు బట్టీయం 6. మాటా-మంతి.

## చింతా దీక్షితులు

ఎంత ఆశాపథాన్ని విహరించే భావాన్నయినా భూమికి దింపి సంఘానికి వెలుగుదారి చూపేటట్టు కవిత్వ పథానికి పట్టించుతాడు. శిష్ట వ్యావహారికాన్ని కమ్మగా హుందాగా వాడినాడు; పద్యాలలో కూడా దానికి గౌరవాన్ని సంపాదించాడు. గురజాడ అప్పారావుగారినీ, వారి ఆశయాలనూ అభిమానంతో చూచుకొనేవాడు. భాష గౌరవాన్నిబట్టీ, ఉత్తమ ఆదర్శాలనుబట్టీ ఈయనను పోల్చుకోవచ్చును. కథక చక్రవర్తి ఈయన.

జననం: 1891, మరణం: 1960

కృతులు: 1. ఏకాదశి (కథలు) 2. శబరి (నాటకం) 3. హాస్యకథలు 4. వటీరావు కథలు 5. లక్కపిడతలు 6. దాసరి పాట 7. గోపిమోహిని.

# నండూరి సుబ్బారావు

తనకు సాక్షాత్కరించిన కవితను అందుకోడంలో బంధాలను తెంచివేశాడు. నియమాలను తోసిపారవేశాడు. మహో సాహసంతో ఈయన గీతాలు గుండెలలో నుంచి సూటిగా, వెచ్చగా ప్రవహిస్తవి. ఈయున సంస్కారం స్వచ్ఛమైన భూసారం నుంచి ఉత్తేజమందింది. మహో సున్నితమైన హృదయంతో భావిస్తాడు. 'చూపుతో మాటాడి' 'ఊపిరితో తెనిగించే' నిపుణుడు. భావంలో, భాషలో, అన్నిటా సాహసంతో ఎర్రబావుటా యెత్తినాడు. ఈ తిరుగుబాటు కొందరికి 'గాలి దుమార' మైంది. కొందరికి నవయుగ ప్రభాతవాయు ప్రసరణమైంది.

జననం: 1895, మరణం: 1957

కృతి: యెంకి పాటలు.

# నాయని సుబ్బారావు

పద్యాలు జీవితాన్ని చీల్చుకుని వస్తవి. అందుచేతనే అంత బాధాకరంగా ఉంటవి. తగిలేటట్టు చెబుతాడు. యత్నం లేకుండా, పద్య నిర్మాణానికి పాటుబడినట్టు కనిపించదు. అదే ఈయన కళ, గొప్పది. కవిత్వం ఈయనను వరించింది. వలపులో, విరహంలో, వేదనలో, మాతృప్రేమలో ఈయన కవిత్వానికి హృదయం గీటురాయి. ప్రియురాలి యెడబాటు పిచ్చివాణ్ణి చేసింది. తల్లిమరణం భోరుమనిపించింది. ఆనందంలో స్వర్గ వీధులలో విహారం చేయిస్తాడు. బాధలో హృదయాన్ని బద్దలు కొడతాడు. బ్రతుకులో కవిత్వం ఏరుకుంటాడు. ప్రతి పాదం జీవించే పలుకుతాడు. ఈయున గీతాలు ఉజ్జ్వలములూ, ఉన్నతములూ.

జననం: 1899, మరణం: 1978

కృతులు: 1. సౌభద్రుని ప్రణయయాత్ర 2. ఫలశ్రుతి 3. మాతృగీతములు 4. భాగ్యనగర కోకిల 5. వేదనా వాసుదేవము 6. విషాదమోహనము.

# నోరి నరసింహశాస్త్రి

చిన్న వయస్సులోనే ఆశలుకొల్పి పలికినవాడు. ఆంగ్లకవుల పద్ధతులను అనేక విషయాలు గీతాలు చేసుకున్నాడు. చురుకైన మెదడు, కళ మెలకువలనెరిగినవాడు. ఆశలుకొల్పి నెరవేర్చక వదలినాడు. సోమనాథ విజయం, ఖేమాభిక్షుని వంటి నాటకాలు ఈయన కళాకౌశలాన్ని ప్రకటిస్తవి.

జననం: 6.2.1900, మరణం: 1980

కృతులు: 1. గీతమాలిక 2. భాగవతావతరణము (పద్యనాటిక) 3. సోమనాథ విజయం (నాటకం) 4. కవిసార్వభౌముడు 5. రుద్రమదేవి 6. నారాయణభట్టు.

# పింగళి-కాటూరి

తన నూతనాలంకారాల చేతను పాత పద్ధతులవారు పరిహసిస్తున్నారని నవ్య సాహిత్యం నలుగురిలోకి రావడానికి జంకి బిడియపడుతూవున్న రోజులలో, ఆమె నూతన కైసేతను ప్రశంసిస్తూ ప్రచారం చేసిన కవులు వీరు. తెలుగునాటను కనులపండువుగా కనపడే సంక్రాంతి దృశ్యాలకు ఒక శాశ్వతత్వం కల్పించడంలో వీరు మాటల్ని రంగులుగానూ, కలాన్ని కుంచెగానూ వాడిన విచిత్ర చిత్రకారులు. కృషీవలుడికి తొలకరి చినుకుల విలువవలె వీరి 'తొలకరి' కూడా భావికృషికి ప్రయోజనకారి అయినది. వీరి కవిత్వానుభవం పరువెక్కిన తరువాత వెలువడిన 'సౌందరనందము' వీరి పూర్తి విలువను వ్యక్తపరుస్తుంది.

పింగళి లక్ష్మీకాంతం జననం: 1894, మరణం 1972

కాటూరి వెంకటేశ్వరరావు జననం: 1895, మరణం 1962

కృతులు: 1. తొలకరి 2. సౌందరనందము 3. పౌలస్త్య హృదయము.

# పెనుమర్తి వెంకటరత్నం

దేశాభిమానం, భాషాభిమానం ఎక్కువగాగల యువకుడు. ఈయన కవితలో మెత్తని మెలకువ గోచరిస్తవి. పాపం, తొందరలో ముగిసిపోయింది ఈయన జీవితం. ఈ కాస్తలో ఈయన పలికిన వాక్కులనుబట్టి గ్రహిస్తే, ఏ మబ్బుల మలుపులలోనో దృష్టికి ఆనని ఆశయాలను తెరచాపను ఎత్తిన సాహసపు నావికుడివలె కనిపిస్తాడు. ఈయన ఆశించిన యాత్రకు శరీరం కలసిరాలేదు.

జననం: 1907, మరణం 1930

కృతులు: 1. నీతిసుధ 2. రత్నాపణము.

# చావలి బంగారమ్మ

తెలుగు పుట్టింటి నుడికారం ఈమె గీతాలలో ప్రత్యేక కమ్మదనం. సంస్కృత ఇంగ్లీషు కోటరికాలలో వూపిరాడని తెలుగునకు ఈయమ పలుకురాక అలనాటి తీయటి తెనుగు ప్రాణవాయువు కాగలదు. తెనుగు కడుపునపుట్టి చేవ దేరిన నుడికారం ఈమె భాష పోకడలలోనూ, తాటాకు బొమ్మలకు ప్రాణం పోసి కన్న బిడ్డనుగా చంకకు యెత్తగలిగిన పసినాటి తెలుగుభావన ఈమె ఊహావీథిలోనూ.... ఈమె ఊహా ప్రపంచంలో ఎంత గారడీ వున్నదో ఆనందించవలెనంటే 'ఆ కొండ' లోని చోద్యాన్నిబట్టి గ్రహించవచ్చును. పుట్టుకతోనే కవిత్వం, పాండిత్య ప్రకర్షతో దీనికి సంబంధంలేదు, అనుటకు ఈమె తార్కాణం.

జననం: 1897, మరణం 1960

# బసవరాజు అప్పారావు

నగ్నంగా, నిజంగా వుంటుంది ఈయన కవిత్వం. జిలుగూ తళుకూ ఉండదు, ఉండటానికి వీలులేదు. ప్రతి భావమూ గుండె చీల్చుకుని దూకుడుగా వొస్తుంది. అందుచేతనే ఈయన పాటలలో తొలిచరణాలే గుండె పట్టుకుంటవి. అనుభవాలే పాడుకుంటాడు. తనకోసమే ముఖ్యంగా అనిపిస్తుంది. జీవితంలో ఏ దెబ్బ ఏ... ... కలిగినా వెంటనే పలుకుతాడు. మహోచురుకైన హృదయం. ఫక్కీ గురజాడ అప్పారావు గారిది, కాని కవిత్వం కళాదరణ హెచ్చు.

జననం: **1894**, మరణం **1933**.

కృతి: బసవరాజు అప్పారావు గీతములు

# అడివి బాపిరాజు

కవిత్వమే కాదు, చిత్రలేఖనమే కాదు, అభినయమే కాదు, సులభంగా ఈయనకు అలవడని కళలేదు. కళలు ఈయనను వరించినవి; అందుచేతనే ఈయన చిత్తరువులు కవిత్వ భాషలో లిఖించినట్లు వుంటవి. ఈ చిత్తరువులలోని రేఖలు నాట్య విన్యాసంతో కదులాడుతవి. జానపదుల జీవితాలూ, వారి పదాలూ ఈయనను కలతపెట్టి కళాపుష్టిని కలిగిస్తవి. ఉత్కృష్ట ఆదర్శాలు, స్వతంత్రమైన ఊహలు.

జననం: **1895**, మరణం **1952**

కృతులు: **1.** తొలకరి **2.** గోధూళి **3.** నారాయణరావు **4.** హిమబిందు **5.** తుఫాను **6.** గోన గన్నారెడ్డి **7.** కోనంగి **8.** నరుడు **9.** అంజలి **10.** రాగమాలిక **11.** తరంగిణి **12.** అడవి శాంతిశ్రీ **13.** మధురవాణి **14.** రాతి రథము **15.** శశికళ **16.** జాజిమల్లి **17.** భోగిలోయ.

# రామచంద్ర అప్పారావు

ఈయన పుట్టుకను అందుకున్నది బంగారు తూగుటుయ్యేల, ఈయన పసినాటి తొలిచూపులకు పులకరించినవి కాంచన, ఘంటికా నినాదాలూ, ఆశ్రితుల అభిమాన సేవలూ, కాని, వియ్యమందింది హృదయం విశ్వవేదనతో. కన్నులు పరిచయం అలవరచుకున్నవి కలతగను విషాదచ్ఛాయలతో. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి అంతటి ఆయన ఈయన పాలబుగ్గలను పలికినకావ్యం 'తరణము' నకు మెచ్చుకుంటూ 'ఈ కాలమునన్ గవిత్వమనగాఁ, బెడత్రోవలఁ ద్రొక్కుచున్న గయ్యాళికిఁ దుల్యమై చెడుట యారయుచుంటిమి. వారిత్రోవలన్ గాలిడఁ బోకుమయ్య! యది గాలికి ధూళికిపోవు' అని జాగరూకత పలికినప్పటికీ, నిజమైన కవిత్వానికి ఆకర్షణ గల రసపిపాసువు. ఈయన హృదయం 'కీట్స్', 'షెల్లీ' లవైపే మరలింది. ఈయన 'ఉపాసన' లోని తీవ్రత ఈనాటి నూతన కవిత్వానికి కూడా నూతనం.

జననం: **1909**.

కృతులు: 1. తరణము 2. నీలిరత్నాలు 3. వసంతగీత 4. ఉపాసన 5. అమరకావ్యము (ఉమర్ ఖయ్యాం అనువాదం)

## దువ్వూరి రామిరెడ్డి

స్వచ్ఛంద ఆశయాలు, స్వేచ్ఛానురక్తీ, నిర్మలజాతీయతా ఈయనకు ఆవేశాన్ని ఇచ్చేవి. ఆంగ్ల ఫారసీ వాఙ్మయాల మంచి పలుకుబడిని గ్రహించినాడు. నూతన భావాలను సహితం తెలుగుజాతీయత ననుసరించి నిర్దుష్టంగా, స్పష్టంగా పలికాడు. పూర్వపద్ధతుల మీదను అభిమానం మెండయినా, అభిసారిక వంటి కొత్తపోకడలు కల్పించాడు. ఈయన కర్షక కవి. నగర విజ్ఞానాన్ని చవిచూసినా జీవితాన్ని పొలంగట్టుకే మరలించాడు. వాల్మీకి కళాసంపత్తిని అనుభవించగలడు. గరికపోచ కదలికతో హృదయం శ్రుతికలిపి విశ్వవ్యాప్త జీవిత రహస్యం గ్రహించగలడు.

జననం: 1895, మరణం 1947

కృతులు: 1. కృషీవలుడు 2. జలదాంగన 3. నలజారమ్మ అగ్నిప్రవేశము 4. నక్షత్రమాల 5. నైవేద్యము 6. వనకుమారి 7. పానశాల (ఉమర్ ఖయ్యాం అనువాదం) 8. గులాబితోట 9. పండ్లతోట.

## రాయప్రోలు సుబ్బారావు

అన్నిటా తెలుగువాడు. అభిమానంలో, భావాలలో, పోడిమిలో, పోకడలలో, తీయని మెత్తని పదాలను సున్నితంగా శ్రావణంతో ఏరి నాజూకుగా పొదగగల గొప్ప, నడకలలో కులుకువిన్నాణములు ఒప్పించగల శక్తి ఈయన సొమ్ము. రవీంద్రుని సాన్నిధ్యమూ, వైష్ణవగీతాలలోని రక్తిమా ఈయనకు ఒక వింత సంస్కారాన్ని కూర్చినవి. 1913 ఆంధ్రోద్యమము ఈయన దృష్టికి ఆంధ్ర తేజస్సును సాక్షాత్కరింపించింది. ఒకనాటి ఆంధ్రౌన్నత్యాన్ని అపూర్వ కవితాదృష్టితో చూడగలిగాడు. ఆనాటి మహత్కార్యాలకు తన జాతిని పురికొల్పి తన కవిత్వాన్నీ, కళనూ, ఆవేశాన్నీ ఉపయోగించి దేశీయుల హృదయాలను కలచి భక్తితో, బాధతో, ఆందోళనతో కారుతూవున్న కన్నీటిజాలు వెలుగులో పూర్వపు టాంధ్రౌన్నత్యాన్నీ, భావిశోభనూ దర్శించగలిగాడు.

జననం: 1892 మరణం 1984.

కృతులు: 1. జడకుచ్చులు 2. తెనుగుతోట 3. తృణకంకణం 4. స్నేహలతాదేవి 5. స్వప్నకుమారము 6. కష్టకమల 7. ఆంధ్రావళి 8. లలిత 9. మధుశాల (ఉమార్ ఖయ్యాం అనువాదం) 10. రమ్యాలోకం.

## కొడవటిగంటి వెంకటసుబ్బయ్య

సాహితీసమితి తొలిరోజులలోనివాడు. ఆ రోజులలో ఈయన కవిత్వానికి చాలా పలుకుబడి వుండేది. ఈయన పద్యాలలో మృదుత్వమూ, హాయీ ఉన్నవి. ఈయన 'భిక్షువు', 'సెలయేరు' ఎప్పటికీ రుచించేవే. ఆధ్యాత్మికమైన అన్వేషణకై కుటుంబాన్నీ

మిత్రులనూ విడిచి ఏ హిమాలయాలకో వెళ్ళిపోయాడు. కవిత్వం కన్నా ఎక్కువైనదానినీ, కుటుంబంకన్నా, మిత్రులకన్నా చేరువైనదానినీ, దేనిని సాధించాడో, ఈనాటికీ అజ్ఞాతంగానే వున్నాడు.

జననం: 1897.

కృతి: సంధ్యారాగము

## వెంకట పార్వతీశ్వరులు

వీరు ఒకవిధంగా యుగసంధిలోనివారు. భక్తిపట్టున మహా పరవశులు. వీరి వాణి కొండయేరువలె మంజుగానంతో అతిత్వరితంగా ప్రవహిస్తుంది. వైష్ణవ గీతాలలోని ప్రేమోన్మాదం వీరి భావోద్రేకాన్ని ఎక్కువగా రగిల్చింది. భాష కూర్పులో, పలుకు విధానంలో నూతనత్వాన్ని కల్పించారు.

ఓలేటి పార్వతీశం – జననం: 1882, మరణం 1955

బాలాంత్రపువేంకటరావు – జననం: 1881, మరణం 1972

కృతులు: 1. కావ్యకుసుమావళి 2. ఏకాంతసేవ 3. రత్నహారము

## విశ్వనాథ సత్యనారాయణ

పండితుడు, కవి; పద్యాలలో ఎన్ని పోకడలైనా పోగల శక్తివంతుడు. ఏ విషయాన్నైనా కవిదృష్టితో చూడగల కళాశీలి ఈయన. ఈయన రచనలలో ఎక్కువగా కనబడేవి బలమూ, జీవమూ. రాయప్రోలు సుబ్బారావుగారివలె ఈయననూ ఆంధ్రాభిమానం పూరించింది. నేడు పాడుపడివున్న వేగి, ముఖలింగం వంటి క్షేత్రాలు కాలాన్నిదాటి ప్రసరించే ఈయన చూపునకు ఎదురువొచ్చి ఒకనాటి తమ శోభతో దర్శనమిచ్చి ఆవేశపూరితుణ్ణి చేసినవి. ఈయన ఆంధ్రుడు. ఆంధ్రత్వంలో మహాగర్వి. కవిత్వం పోకడలలో, ప్రాచీన ప్రయోగాలలో గడుసరి.

జననం: 1895, మరణం: 1976

కృతులు: 1. ఆంధ్రప్రశస్తి 2. కిన్నెరసాని పాటలు – కోకిలమ్మ పెళ్ళి 3. గిరికుమారుని ప్రేమగీతాలు 4. శృంగారవీధి 5. మాస్వామి 6. ఋతుసంహారం 7. శశిదూతం 8. వేయిపడగలు 9. ఏకవీర 10. చెలియలికట్ట 11. మాబాబు 12. జేబుదొంగలు 13. ధర్మచక్రం 14. బద్దన్న సేనాని 15. హాహాహూహూ 16. వీరవల్లడు 17. దేవతల యుద్ధం 18. మూడుతరాలు 19. రామాయణ కల్పవృక్షము 20. నర్తనశాల 21. వేనరాజు 22. అనార్కలి 23. త్రిశూలం 24. స్వర్గానికి నిచ్చెన 25. పులుల సత్యాగ్రహం 26. తల్లిలేని పిల్ల 27. చిన్నకథలు 28. తెరచిరాజు.

# తల్లాప్రగడ విశ్వసుందరమ్మ

అందరాని ఊహలను ఆశించే వ్యక్తి ఈమె. అందుచేతను భావప్రపంచం సరిహద్దులదరికి మాత్రం తీసుకుపోతవి ఈమె గీతాలు. ప్రతి గీతంలోనూ అవ్యక్తంగానైనా ఒకవేదన గుండె చురుక్కుమన్న కోకిల కేకవలె ధ్వనిస్తుంది.

జననం: **1900**, మరణం: **1949**

# మల్లవరపు విశ్వేశ్వరరావు

భావన చిత్రగతులను విహరిస్తుంది. అనుగుణంగా గీతం నడకలు కూడా ఏ మబ్బులలోనికో ఎగురవలెనన్న ఆశ ఈయన గీతాలకు మూలం. నియమాలకు లొంగనితనం ఈయన తిరుగుబాటు.

జననం: **1904**, మరణం **1986**

కృతులు: **1**. మధుకీల **2**. కల్యాణకింకిణి

# వేదుల సత్యనారాయణశాస్త్రి

కవిత్వపులోతులు తెలిసినాడు; భావాన్ని, భాషనూ ఒక్కశ్రుతికి కూర్చ గలడు. భాష లొంగిన పనిముట్టు. ఎంతక్లిష్టమైన భావాన్నైనా చక్కగా చెప్పి పద్యం సుఖంగా నడిపించగలడు. వృత్తాలు నడిపించడం ఈయన సొమ్ము. జీవితం దుర్భరంగా తోచినప్పుడు ఆ కుములుతూవున్న వేదనంతా పాడుకుని ఓదార్పు చెందాడు. అందుచేతను 'షెల్లీ' పలికినట్టు ఈయన అతి తీయని కవిత్వం ఏ తీరని వేదనన కలవరపెడుతుంది. ఈయన 'పూర్ణిమ' 'దీపావలినాడు' వంటి పద్యానికి గర్విస్తాను అన్నాడు. ఈయన పద్యనిర్మాణంలో పూర్వుల శిల్పం కూడా కొత్త వొయ్యారాలు కులుకుతుంది. ఈయన ఏ భావాన్ని రేకెత్తించినా దానిలో అధునాతన తేజస్సు గోచరమవుతుంది. కాళిదాసు కావ్యాలలోని పరువమూ, బరువూ ఈయన పద్యాలలో కనిపించింది.

జననం: **1900**

కృతులు: **1**. దీపావళి **2**. ముక్తఝరి

# తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

పండితుడు, వ్యుత్పన్నుడు. హృదయంగలవాడు, ప్రేమించినవాడు, బాధపడ్డవాడు. జీవించినవాడు. పూర్వపు సంస్కారమంతా బలాన్ని కూరుస్తూ వుండగా రాదగిన నూతనత్వాన్ని ఆహ్వానించాడు. నూతనపంథా తొక్కిన కవులలో చాలామందికి బలమూ, హుషారు యిచ్చి నూతన కవిత్వయుగ స్థాపనకు తోడ్పడ్డాడు. ఈనాటి ఇతర కవులవలె ఒక ప్రియురాలికి ఒక గీతం కాకుండా, ప్రేమించిన హృదయేశ్వరిపై ఒక నిండుకావ్యం అల్లుకున్నాడు. ఈయన వాణి పాతపోకడలతో నూతన అలంకారాలకు పొందిక కుదిర్చి గంభీరంగా కనిపిస్తుంది.

జననం: 1882, మరణం 1979

కృతులు: శివశంకర కృతులు 1. ప్రథమ సంపుటి, 2. ద్వితీయ సంపుటి, 3. తృతీయ సంపుటి.

## శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ)

ఈయన పలికే విధానమూ, భావించే పద్ధతికూడా ఒక కొత్తదనాన్ని సూచిస్తుంది. 'స్పెన్సర్'మొదలు 'జాయిస్' విధానంవరకూ ఆంగ్ల కవిత్వ పోకడలను అవగాహన చేసుకొని, నవ్యసాహిత్యానికి విశ్శృంఖలమైన స్వాతంత్ర్యాన్ని సమకూర్చాడు. 'కాలానికి కళ్ళెం వేస్తాం. ప్రేమానికి గొళ్ళెం తీస్తాం' అని పడుచుగుండెలకు రెపరెపలుకల్పించి, 'పుడమితల్లికి పురిటినొప్పులు' 'మరో ప్రపంచం పుడుతూ వుంది, అదిగో కనబడలేదా, మరో ప్రపంచపు అగ్ని కిరీటపు ధగధగలు!' అని యువకనేత్రాలకు కైపుచూపు కల్పించీ, కలవరపెట్టి; 'ఆకాశపుదారులంట అడావిడిగ వెళ్ళిపోయే' రథచక్రాల్ని 'భూమార్గం పట్టిస్తాను జనావళికి శుభం!' అంటూ అభయహస్తం చూపించీ; నూతనోత్సాహాన్నీ, ఉద్రేకాన్ని కలిగించడమే కాకుండా, వింతవీథులతో మానవ సమాజానికి నూతన లక్ష్యాలను నిర్దేశించడంలో విప్లవప్రాయమైన విధానాలను వెతుకుతున్నది ఈయన వాణి. వింత వీథులతో పరుగుతీయడంలో మహాసాహసికుడు.

జననం: 1910 మరణం: 1983

కృతులు: 1. ప్రభవ 2. మహాప్రస్థానం 3. ఖడ్గసృష్టి 4. మరోప్రస్థానం

## సౌదామిని-బసవరాజు రాజ్యలక్ష్మమ్మ

కడుసున్నితము, మహాగంభీరము ఈయమ పలుకు. హృదయము, గుండెలు వణికే విశ్వమంత ప్రేమా. ఆ గాంభీర్యాన్నంతా అణుచుకుని వోర్చి, యెదురుచూసే మహత్తర శక్తి, ఈమె గీతాలలో పొంచి కనిపించుతవి. నిరాడంబరానికీ, స్వచ్ఛతకూ, ఈమె గీతాలు గొప్పవి. ఒక్కొక్క గీతం ఒక్కొక్క హృదయ స్పందనం.

జననం: 1904.



# ఇందులో కవితలు...

## అబ్బూరి



## కవికొండల



## కృష్ణశాస్త్రి

